ఇరువదినాలుగవ

# ఆంధ్రదేశ గ్రంథాలయ మహాసభ

హిందూపురము (అనంతపురము జిల్లా)

**1942 డిసెంబరు 29-31, 1943 జనవరి 1**








ప్రకాశకులు

ంధ్రదేశ గ్రంథాలయ సంఘము

పటమటలంక (వయా) బెజవాడ

1943

## మా స్వంతప్రచురణాలు

# ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘము

1. ఇరువదియైదవ సంవత్సర నివేదిక 1938-39 సం.
2. ఇరువదియారవ సంవత్సర నివేదిక 1939-40 సం.
3. ఇరువదియేడవ సంవత్సర నివేదిక 1940-41 సం.
4. ఇరువదియెనిమిది - ఇరువదితొమ్మిది సంవత్సరముల నివేదిక 1941-42, 1942-43 సం. లు

### 5. ఆంధ్రదేశ గ్రంథాలయముల పట్టిక

ఇందు ఆంధ్రదేశములోని 779 గ్రంథాలయముల చిరునామాలు జిల్లా, తాలూకా, గ్రామము, గ్రంథాలయములవరుసను అకారాదిగ కూర్చబడినవి.

గ్రంథకర్తలకు, పత్రికాశకులకు, గ్రంథవిక్రేతలకు మిక్కిలి ఉపయోగ కరమైనది.

136 పేజీల గ్రంథము వెల ఒకరూపాయి

ఆం. దే. గ్రం. సంఘసభ్యుల కుచితము

### 6. వయోజనవిద్య : మొదటిపుస్తకము

కర్త - శ్రీ గాడిచర్ల హరిసర్వోత్తమరావు, ఎం. ఏ.

పెద్దవారికి సులభంగా చదువునేర్పేటందు కిది బాగా ఉపయోగిస్తుంది. దీని సహాయంతో అక్షరాలు బొత్తుగ రానివారికి రెండునెలలలో సామాన్యంగా చదువను, వ్రాయను నేర్పవచ్చును.

1/8 డెమ్మీసైజు 52 పుటలు వెల నాలుగణాలు

ఇరువదినాలుగవ

# ఆంధ్రదేశ గ్రంథాలయ మహాసభ

## హిందూపురము (అనంతపురము జిల్లా)

1942 డిసెంబరు 29-31, 1943 జనవరి 1




ప్రకాశకులు

ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘము

పటమటలంక (వయా) బెజవాడ

1943

*

* *

వాయువెట్లులు స్వేచ్ఛమై ప్రజకు దొరుకు
వల్లె జ్ఞానంబు కూడను నబ్బవలయు
ఉదక మెల్లర కేరీతి నొదవునట్లె
జ్ఞానముం గూడ సేవ్యంబు గాగవలయు
సూర్యచంద్రుల తేజంబు చూరలాడ
నెల్లవారికి లభ్యమై యెసగునట్లె
జ్ఞానముంగూడ సులభంబు గాగవలయు.

* *

*

భారతీ ప్రెస్, తెనాలి

# ప్రకాశకుల విజ్ఞప్తి

హిందూపురములో జరిగిన ౨౪ వ ఆంధ్రదేశ గ్రంథాలయ మహాసభా సంచికను ఆహ్వాన సంఘమువారు మొదట ప్రకటించవలెననుకొంటిరి. ఇందుక్రింద వారు వసూలుపఱచిన ధనము మహాసభా నిర్వహణమునకు ఖర్చగుటయు, తదుపరి రాయలసీమలో తలయెత్తిన కరువు నివారణకార్యక్రమములో ఆహ్వాన సంఘాధ్యక్షులు రావుసాహెబ్ కొద్దం రాజారావుగారు మున్నగువారు నిమగ్నులగుటయు సంభవించినది. అగుటచే నీ ప్రయత్నము నాహ్వాన సంఘమువారు చేయుటకు వీలుపడదయ్యెను.

అప్పటికి గ్రంథాలయ సంఘమునకుగల ఆర్థికలోపము, కాగితము కరువు, ఒకవేళ నిదిలభించినను ధర విపరీతముగా నుండుటమూలమున నీ సంచిక ప్రకటనవిషయమై కొంత యాలస్యము జరిగినది. మహాసభకు సంబంధించిన కార్యనివేదనములు, చిత్రపటములు, కొన్ని యుపన్యాసములు మాకుచేరక మఱికొంత కాలయాపన జరిగెను. మహాసభజరిగి దాదాపు సంవత్సరము కావచ్చుటచే నింకను సంచిక ప్రకటనను వాయిదావేయుట న్యాయముగ దోచక, దీనికి వలయు పరికరములన్నియు పూర్తిగ మాకు లభించకున్నను దీని ప్రకటనకు బూనితిమి. అగుటచే ననివార్యముగ నిందు లోటు లుండగలవు. ప్రాజ్ఞులు మన్నింప వేడికోలు.

పెదపాలెం
16—12—43

ఇట్లు విన్నవించు,
పాతూరి నాగభూషణం
కార్యదర్శి

# సందేశములు

"...నేటిసభ హిందూపురమున జరుగుట మిక్కిలి సంతోషకరము. మా రాయలసీమయందు తెలుగునాడు ఎల్లప్పుడు కృతజ్ఞమైయుండుట ధర్మము. ఉత్సన్నమైపోవనున్న యాంధ్ర సారస్వతమున కుజ్జీవనము ప్రసాదించినది రాయలసీమయే యని మఱువఁజాలము. దక్షిణభారతము శౌర్య పరాక్రమములను, జాతీయతను, మత ధర్మమును నిలువబెట్టినది రాయలసీమయే యని ప్రత్యాంధ్రుడును మాటిమాటికి స్మరించుట విధికృత్యము. మా పూర్వునాఁట జనించినవాఁడే యయ్యు తాను ఉప్పుతో తొమ్మిదియు నచ్చోటనే పడసి శారీరమానసములఁ బుష్టి సంపాదించినవాఁడనను విశ్వాసమునఁ గావలయు తెనాలి రామకృష్ణమహాకవి పరవశుడై "తుంగభద్రా! తుంగభద్రానదీ!" అని గానముచేసినాడు.

* * *

"నేడును రాయలసీమ నాయకులకు గొడ్డువోలేదు. ఆంధ్రదేశమున ఆధునిక త్యాగమూర్తులలో తొలుదొలుతటివారైన శ్రీ హరి సర్వోత్తమరావుగారు నేటి గ్రంథాలయోద్యమ నాయకులలో ప్రధానులై యుపదేష్టలుగా నుండుటయు, వారలు రాయలసీమవారే యగుటయు మన భాగ్యము.

"సర్వేశ్వరుడు సభను జయప్రదముగా నిర్వహింపఁ దోడ్పడుగాక!"

(సం.) పుతుంబాక సీతారామయ్య
ఆహ్వాన సంఘాధ్యక్షుడు
౨3 వ ఆం. దే. గ్రం. మహాసభ

"...రాయలసీమలో గ్రంథాలయములు తక్కువగా కానవచ్చుచున్నవి. ఈ లోపాన్ని తొలగించుట మా ముఖ్య ధర్మమైయున్నాను. ముందు మహాసభనుకూడా రాయలసీమలోనే మరొక జిల్లాలో ఏర్పాటుచేయుటచే ఈ లోపము త్వరగా తొలగిపోవును....

"కొన్ని ఏండ్లనుండి రాయలసీమకును పూర్వాంధ్రసీమకును అందందు కొంత మనస్తాపము వ్యక్తమైనది. కాని దానికి తగిన కారణము కానరాదు. ఉభయ సీమలలోను విశాలాంధ్రత్వభావముకల ప్రేమయుతులగు సజ్జనులే బహుళముగా నున్నారు. ఈ గ్రంథాలయ మహాసభ అట్టి యుత్తమ సోదరప్రేమను పెంపొందింప

చేసి సకలాంధ్రులకు ఆనందము, ఆత్మవిశ్వాసము, వికాసము, కలిగించవలెనని నేను మనస్ఫూర్తిగా కోరుచున్నాను.

"౨౪ వ ఆంధ్రదేశ గ్రంథాలయ మహాసభకు సంపూర్ణవిజయమును కోరుచున్నాను."

(సం.) సురవరము ప్రతాపరెడ్డి
ఉపాధ్యక్షుడు
ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘము

"౨౪ వ ఆంధ్రదేశ గ్రంథాలయ మహాసభ ఈ సంవత్సరము రాయలసీమలో జరుగుట ప్రశంసనీయము. ఈ సంఘటనము రాయలసీమలోని గ్రంథాలయోద్యమాభివృద్ధికి చక్కని దోహదమీయగలదు. అప్పుడు తీరాంధ్రము రాయలసీమాంధ్రమును తమ్ము పడవగల వారలేక ఏకముఖముగా చెట్టాపట్టలు పట్టుకొని పయనించగలదు. ఆ శుభ కాలమున కిది సూచకము.

"భగవాను డీ మహాసభలను దిగ్విజయము గా ననుగ్రహించుగాక !"

(సం.) వద్లమూడి వేంకటరత్నము
అధ్యక్షుడు
తెనాలితాలూకా గ్రంథాలయ సంఘము

"...మహాసభ జయప్రదముగా జరిగి రాగల సంవత్సరమునందు ఆంధ్రదేశమున, అందును ముఖ్యముగ రాయలసీమయందు గ్రంథాలయోద్యమ మభివృద్ధి జెంది భారతావనియందెల్లెడల ఆంధ్రదేశపు కీర్తి ప్రతిష్ఠింపబడవలయునని యాశించుచున్నాను."

(సం.) అడుసుమల్లి శ్రీనివాసరావు
సహాయకార్యదర్శి
ఆంధ్రదేశ గ్రంథాలయసంఘము

"౨౪ వ ఆంధ్రదేశ గ్రంథాలయ మహాసభ జయప్రదముగ జరిగి గ్రంథాలయోద్యమము ఇంకను నభివృద్ధికి వచ్చుగాక యని కోరుచున్నాను. భగవంతుడును తోడ్పడుగాక యని ప్రార్థించుచున్నాను."

(సం) గోటేటి జోగిరాజు
రిటైర్డు అసిస్టెంట్ డైరెక్టర్ ఆఫ్ అగ్రికల్చర్

"... ఏ ఉద్యమమైనను క్రమవికాసము చెందవలెనన్నచో పనిచేయు స్థలము, క్రమశిక్షణపొందిన సేవకులు, అందుకు కావలసిన ధనము ముఖ్యములు. ధనమున్నచో మిగిలినవి సమకూర్చుకొనవచ్చును గాన ఈ సమావేశమునకు దయచేసిన మహనీయు లందరు ప్రతిమనిషి ఒక రూపాయి చొప్పున ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘమునకు సమర్పించి తద్వారా ఉద్యమమును బలపరతురు గాక !"

(సం.) పీతాంబరం వేంకటకృష్ణమాచార్యులు
కార్యదర్శి
విశాఖపట్టణముజిల్లా గ్రంథాలయసంఘము

# విషయసూచిక (Contents)

# ౨౮ వ ఆంధ్రదేశ గ్రంథాలయ మహాసభ

## హిందూపురము

29-12-42 వ తేదీ మొదలు 1-1-43 వ తేదీ పర్యంతము పై మహాసభ అనంతపురం జిల్లాలోని హిందూపురమున శ్రీ లక్ష్మి నాటకశాలయందు మహా వైభవోపేతముగ జరుపబడినది. రిటైర్డు జిల్లా విద్యాశాఖాధికారి రావుబహదూరు శ్రీ యం. లక్ష్మినారాయణరావు, ఎం. ఏ, ఎల్. టి. గారు మహాసభ కధ్యక్షత వహించిరి. మదరాసు యూనివర్సిటీ లైబ్రరీ అధినేతయు, మదరాసు గ్రంథాలయ సంఘ కార్యదర్శియు నగు రావుసాహెబ్ యస్. ఆర్. రంగనాథన్, ఎం. ఏ., ఎల్. టి., ఎఫ్. ఎల్. ఏ. గారు సభను ప్రారంభించిరి. ఆంధ్ర దేశముయొక్క వివిధ ప్రాంతములనుండి గ్రంథాలయ ప్రతినిధులతో పాటు కవులు, పండితులు, గాయకులు, నటకులు పలువురు మహాసభకు వచ్చియుండిరి. మహాసభలో సాధారణముగ జరుగు ప్రదర్శనము, ప్రచారక-వయోజనవిద్య-సాంకేతిక శాఖాసమావేశములతో పాటీపర్యాయము పండితసభ, రాయలసీమ కళాపరిషత్సమావేశము, సాహిత్యసమావేశము, నవ్యసాహిత్య సభ జరిగినవి. వీనికి వరుసను కళాప్రపూర్ణ శ్రీ జనమంచి శేషాద్రిశర్మ, శ్రీమాన్ రాళ్లపల్లి అనంతకృష్ణశర్మ (మైసూరు ఆస్థానవిద్వాంసులు), శిరోమణి కె. వెంకటరామశాస్త్రులు, ఎం. ఒ. ఎల్., దేవులపల్లి కృష్ణశాస్త్రిగార్లధ్యక్షత వహించిరి.

## ప్రారంభము

మహాసభా కార్యక్రమము 29-12-42 వ తేదీ సాయంత్రము 5 గంటలకు ఊరేగింపుతో ప్రారంభమయ్యెను. మహాసభాధ్యక్షు, ప్రారంభకులను, ప్రదర్శనా విమర్శకులను 24 ఎద్దులను పూన్చిన రథముపై గూర్చుండబెట్టి పుర ముఖ్యవీధులలో నూరేగించి మహాసభా భవనమునకు తోడ్కొనివచ్చిరి. మొదట శ్రీయుత సాదలి రామస్వామి, బి. ఏ., బి. ఎల్. గారు దైవప్రార్థన గావించిరి. శ్రీ యస్.

అప్పారావుగారు 'అందరికీ పుస్తకాల్' అను గ్రంథాలయ గీతమును పాడినపిమ్మట ఆహ్వానసంఘాధ్యక్షులు రావుసాహెబ్ శ్రీ రొద్దం రాజారావు, బి. ఏ., బి. ఎల్. గారు తమ స్వాగతోపన్యాసమును చదివి శ్రీ రంగనాథన్‌గారిని సభను ప్రారంభించవలసినదిగ కోరిరి.

రంగనాథన్‌గారు కరతాళధ్వనుల మధ్య లేచి సుమారొక గంట కాల మాంగ్లమున నుపన్యసించిరి. వీరి యుపన్యాసమున ఆంధ్ర దేశ గ్రంథాలయ సేవకుల సేవ యుగ్గడింపబడెను. పంజాబు, బరోడాల లోవలె యూనివర్సిటీ సాయముగాని, ప్రభుత్వ సాయముగాని లేకనే ఆంధ్రగ్రంథాలయోద్యమము కేవలము ప్రజలమీద ఆధారపడినదై ప్రజలవలననే పుట్టి పెరిగినదని వీరు చెప్పిరి. తదుపరి తాము కార్య దర్శిగ నున్న మదరాసు గ్రంథాలయ సంఘు కార్యక్రమము నొకింత వివరించి గ్రంథాలయము, విద్య యను పదముల నిర్వచనమును చెప్పి విద్యావిషయమై పాశ్చాత్య సీమలలో శారీరకముగ, మానసిక ముగ విజ్ఞానము చాలినంత వృద్ధిజెందినను, ఆత్మకు సంబంధించిన జ్ఞానమును వారు బొత్తుగ విడచిరనియు, ఆత్మవికాసమును కలుగజేయని విద్యకు పరిపూర్ణత యుండదనియు, ఈ లోపమును తీర్చి ప్రపంచమునకు శాంతి సౌఖ్యముల ప్రసాదించుట కనుకూలపడు విధానమును మనము ప్రపంచమునకు చూపవలసి యున్నదనియు మున్నగాగల విషయ ముల విస్తరించి చెప్పిరి.

## అధ్యక్షోపన్యాసము

హిందూపుర పురపాలక సంఘాధ్యక్షులు శ్రీ కట్టా వెంకట శేషయ్యాగారు, మహాసభాధ్యక్షులు రావుబహదూరు లక్ష్మినారాయణ రావుగారిని సభవారి కెఱుకపఱచి, వారి నగ్రాసనాధిపత్యము వహించి కార్యక్రమమును నడుపగోరిన పిమ్మట వారు క్రిందివిషయముల తమ యధ్యక్షోపన్యాసమున నుద్బోధించిరి.

"ప్రభుత్వమువారు నిర్బంధించి విద్య ప్రజల కివ్వనిదానివల్లను, ప్రజలు తమ ధర్మమును గ్రహించనిదానివల్లను, దారిద్ర్యకారణము

నను ప్రారంభ, ఉన్నత విద్యలు ప్రజలలో సరిగా వ్యాప్తికాలేదు. లెక్కలు తేలిస్తే భారతదేశములో 100 కి 6 మంది మాత్రము విద్యా సంస్థలలో చదువుకొన్నారనియు, మన రాజధానిలోని దాదాపు $4\frac{1}{2}$ కోట్ల ప్రజలలో 100కి 8 మంది మాత్రము విద్యాసంస్థలలో చదువుకొన్నారనియు, విద్య నభ్యసించుటకు తగినవారు 33 లక్షలున్నను వారిలో నే కొద్దిమంది కూడ పాఠశాలలకు పోవుటలేదనియు తెలియుచున్నది. ప్రాథమిక విద్య నేర్చినవారు కాని, విశ్వవిద్యాలయ విద్య నేర్చినవారు కాని గ్రంథాలయములు లేనందుననూ, ప్రయోజన రహితమైన చదువుల మూలముననూ, పల్లెలలో పోట్లాడుచుండుటకవకాశములు కల్పించుకొనుచున్నారు.

ఆంధ్రదేశములో కొన్ని వందల గ్రంథాలయము లున్నవి. ఇందు రాయలసీమలోనివి చాల స్వల్పము. ఈ మహాసభ రాయలసీమలో జరుగుట యిచ్చటి భావి ఉద్యమప్రాబల్యమున కుపకరించునని నమ్ముచున్నాను. హిందూపురవాసులు చేసిన ప్రశంసనీయమగు నీ మహాసభ మూలమున నికముందు రాయలసీమలోని ప్రతి గ్రామమునను గ్రంథాలయ మొకటి నెలకొల్పబడవలెను. పాఠశాలలలో గ్రంథాలయమున కెక్కువ ప్రాముఖ్యత నివ్వవలెను. అచ్చటచ్చట కూడలి స్థలములలో కేంద్రగ్రంథాలయముల నేర్పఱచి దానికి చుట్టుపట్టుల నుండు గ్రామ గ్రంథాలయములు పరస్పరము సహాయం చేసికొని అభివృద్ధికి రావలెను. విద్యాధికులు, విద్యాభిమానులు ఈ కార్యక్రమమునకు తోడ్పడి జనసామాన్యమునకు విద్య నొసగి వారిని జ్ఞానవంతులుగ నొనర్పవలెను.”

అధ్యక్షుని యుపన్యాసానంతరము మహాసభ విజయమును గోరుచు పంపబడిన పెద్దల సందేశములను ఆహ్వానసంఘ కార్యదర్శి శ్రీయుత వై. వి. అశ్వత్థనారాయణరావుగారు చదివిరి. ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘకార్యదర్శి శ్రీయుత పాతూరి నాగభూషణంగారు సంఘముయొక్క గతసంవత్సర నివేదికను సంగ్రహముగ తెలిపిరి. అనంతరము గ్రంథాలయ కళాప్రదర్శనముల బహిరంగ పఱచుచు

పెనుగొండ డిప్యూటీ కలెక్టరు ఎ. ఆర్. కృష్ణస్వామి, ఎం. ఏ. గారు రాయలసీమలోని కళలను, పరిశ్రమలను, విజయనగరరాజుల కాలము నాటి ప్రసిద్ధిచెందిన శిల్పమును మెచ్చుకొనుచు మాట్లాడిరి.

## శాఖాసమావేశములు

**సాంకేతికశాఖ :** 30–12–42 వ తేదీ ఉదయం 9 గంటలకు సాంకేతికశాఖా సమావేశము దీని కధ్యక్షులుగ నియమింపబడిన ఆంధ్ర యూనివర్సిటీ లైబ్రరీకి చెందిన శ్రీయుత పి. కొండారెడ్డి, డి. యల్. యస్. గారు కారణాంతరములచే రాజాల నందున ఆం. దే. గ్రం. సంఘ సహాయ కార్యదర్శి శ్రీయుత మల్లెల శ్రీరామమూర్తిగారి అధ్యక్షతను కూడెను. శ్రీ కొండారెడ్డిగారి అధ్యక్షోపన్యాసమును మదనపల్లి వాస్తవ్యులు విద్వాన్ క. సుబ్బరామప్ప, ఓ. ఏ, బి. ఇడి. గారు చదివిరి. ఆం. దే. గ్రం. సంఘ కార్యదర్శి శ్రీ పాతూరి నాగభూషణం, డి. యల్. యస్., దుర్భాక కృష్ణయ్య (సర్టిఫైడ్ లైబ్రేరియన్) గార్లు గ్రంథాలయ నిర్వహణములో సాంకేతికశాఖ ఆవశ్యకతను గూర్చి మాట్లాడినపిమ్మట బెజవాడ కాలేజీ ప్రిన్సిపాలు డాక్టరు పుట్టపర్తి శ్రీనివాసాచార్యులుగారు ఆంధ్ర సంస్కృతిపై సుమారు గంటకాలము గంభీరోపన్యాసము గావించిరి. అధ్యక్ష పీఠమునన్న శ్రీరామమూర్తిగారి ఉపసంహార వాక్యములతోను, ఆం. దే. గ్రం. సంఘ కార్యదర్శిగారి వందన సమర్పణముతోను మధ్యాహ్నం 1 గంటకు ఈ సమావేశము ముగిసెను.

**ప్రచారశాఖ :** 30–12–42 వ తేదీ మధ్యాహ్నం 3 గంటలకు ప్రచారశాఖా సమావేశము ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘాధ్యక్షులు శ్రీయుత గాడిచర్ల హరిసర్వోత్తమ రావు ఎం. ఏ., గారి అధ్యక్షతను కూడెను. అధ్యక్షుల ఉపన్యాసానంతరము క్రింది వ్యాసకర్తల వ్యాసములు సభలో చదువబడెను.

| | |
|---|---|
| పై. వి. అశ్వత్థనారాయణరావుగారు, బి. ఏ., హిందూపురం | ఆధునిక యుగము : గ్రంథాలయములు |
| రావుసాహెబ్ గోటేటి జోగిరాజుగారు, కొండెవరం | గ్రామప్రజలు : గ్రంథాలయములు |
| పాతూరి నాగభూషణంగారు, డి. యల్. యస్., పెదపాలెం | గ్రంథాలయము : విద్యాలయము |
| పి. వేం. కృష్ణమాచార్యులుగారు, అనకాపల్లి | గ్రంథాలయ సేవకుడు |
| మాద్దుల అశ్వత్థనారాయణగారు, బి. ఏ, ధర్మవరం | గ్రంథాలయ వ్యాప్తి |
| పి. కె. లక్ష్మీపతిశాస్త్రిగారు, తెనకల్లు | సంచార గ్రంథాలయములు |
| డాక్టరు యస్. సి. వేంకటాచార్యులుగారు | ప్రాచీన భారతీయ విజ్ఞానము (పద్యములు). |

శ్రీయుతులు శిరోమణి టి. వి. వరదాచార్యులు, మలుగురు టి. గురుమూర్తి, కల్లూరు అహోబలరావు, శ్రీ జగదీశ చంద్రరాయలు గార్లును—వయోజన విద్యాశాఖా సమావేశములో నుపన్యసింపవలసిన జనాబ్ ఉమర్ ఆలీషా కవి ఎం. ఎల్. ఏ, గారును ఉపన్యసించిన పిమ్మట అధ్యక్షుల అంత్యోపన్యాసముతోను, వందన సమర్పణము తోను ఈ సమావేశ మత్యంత జయప్రదముగ ముగిసెను.

**వయోజన విద్యాశాఖ**: 31–12–42 వ తేదీ ఉదయం 9 గంటలకు వయోజనవిద్యా శాఖాసమావేశము సుప్రసిద్ధ వయోజనవిద్యా ప్రచారకులు 'వెన్నెలవిద్య' గ్రంథకర్తలు-డోర్నకల్లు వాస్తవ్యులు నగు శ్రీ. కె. కె. జి. సుందరంగారి అధ్యక్షతను జరిగెను. విద్యాప్రబోధ గీతము, వయోజనవిద్యా ప్రబోధ గీతముల ననంతరము అధ్యక్షులు అక్షరాస్యతా ప్రచారములోని తమ అనుభవములను, వయోజనుల నక్షరాస్యులుగ చేయుట కవలంబింపదగు విధానములను సోదాహరణముగ విస్తరించి చెప్పిరి. వీరి యుపన్యాసము 1½ గంటలకు పైగా నడచినను, పొల్లుమాట లేవియు లేక, వినుగత్తించక ప్రతినిధులకును, ప్రేక్షకులకును మిక్కిలి సంతృప్తి నిచ్చెను. వీరి యుపన్యాస మైన తదుపరి "వయోజనవిద్య: బోధకుల శిక్షణ"ను గూర్చి శ్రీ గాడిచర్ల హరిసర్వోత్తమ రావుగారును, "వయోజనవిద్య: గ్రంథాలయముల"ను గూర్చి గ్రంథాలయోద్ధారక శ్రీ అయ్యంకి వెంకటరమణయ్యగారును ఉపన్యసించిరి. హిందూపురం రేంజి పాఠశాల డిప్యూటీస్కూల్సు ఇన్‌స్పెక్టరు శ్రీయుత టి. అప్పలనరసయ్య, ఎం. ఏ., బి. ఇడి. గారు 'మౌనపఠనము'ను గూర్చి ఆంగ్లమున మాటలాడిరి.

అధ్యక్షుని అంత్యోపన్యాసముతోను, వందన సమర్పణముతోను ఈ సమావేశము మధ్యాహ్నం 1 గంటకు ముగిసెను.

## ప్రదర్శనాదికము

**29–12–43** వ తేదీన బహిరంగపరుపబడిన గ్రంథాలయ, కళాప్రదర్శనములు హిందూపురమునందలి ప్రభుత్వ వ్యవసాయశాఖా డెమాన్‌స్ట్రేటరుగారి ఆఫీసులో నేర్పాటు చేయబడినవి. గ్రంథములు, పత్రికలు, గ్రంథాలయ నిర్వహణమునకు వలయు పట్టికలు, వయోజనవిద్యా సంబంధమగు వాఙ్మయము, ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘమువారి ప్రచురణములు, వ్యవసాయారోగ్య కళాసంబంధమైన పరికరములు ఇందు ప్రదర్శింపబడెను.

మహాసభ కేతెంచిన పెద్దలయు, ప్రతినిధులయు వినోదార్థము **30-12-42** వ తేదీన సంగీతాది వివిధ ప్రదర్శనమును, 31-12-42 వ తేదీ రామదాసు నాటకమును నేర్పాటు చేయబడెను. రామదాసు నాటకములో నాట్యకళాప్రపూర్ణ శ్రీ తాడిపత్రి రాఘవ, బి. ఏ., బి. ఎల్. గారు రామదాసు పాత్రను, ఆహ్వానసంఘాధ్యక్షులు రావుసాహెబ్ రొద్దం రాజారావు బి. ఏ, బి. ఎల్. గారు తానీషా పాత్రను నిర్వహించి ప్రేక్షకుల కెంతో యుల్లాసమును కలుగజేసిరి.

## ముగింపు

**31-12-43** వ తేది మధ్యాహ్నము వయోజనవిద్యా శాఖా సమావేశము పూర్తియగుటతోడనే మహాసభ ముగింపు సమావేశము జరిగెను. చర్చల అనంతరము తీర్మానములు సభలో నంగీకరింపబడెను. మహాసభ పక్షమున ధర్మవరము వాస్తవ్యులు - శ్రీ క్రియాశక్తి యొడయరు గ్రంథాలయ జనకులు, ఆదర్శగ్రంథాలయ సేవకులు నగు శ్రీరామానంకుల వెంకటేశమయ్యగారికి సన్మానపత్రము సమర్పింపబడెను. వారు దీనికి సమాధానమును చెప్పిన యనంతరము అధ్యక్షుల యుపసంహార వాక్యములతోను, ఆహ్వానసంఘమువారి యొక్కయు, ఆంధ్రదేశగ్రంథాలయ సంఘమువారియొక్కయు వందన సమర్పణముతోను గ్రంథాలయ మహాసభ ముగిసెను.

**1-1-43**వ తేది నూతన సంవత్సరారంభదినమున హిందూపురమునందలి సేవామందిరమున రాయలసీమ నాట్యకళాపరిషత్సమావేశము, నవ్యసాహిత్య సమావేశము జరిగినవి. మహాసభకాహ్వానింపబడిన కవులు పండితులు సన్మానింపబడిరి. శాలువలు వీరికి బహూకరింపబడినవి. ఇట్లు సన్మానింపబడిన వారిలో శ్రీయుతులు జనమంచి శేషాద్రిశర్మ, రాళ్లపల్లి అనంతకృష్ణశర్మ, టి. రాఘవ, కె. వెంకటరామశాస్త్రి, దేవులపల్లి కృష్ణశాస్త్రి, డాక్టరు పుట్టపర్తి శ్రీనివాసాచార్యులు, శ్రీ గాడిచర్ల హరిసర్వోత్తమరావు, దోమా వెంకటస్వామి గుప్తగార్లు గలరు. సంగీతాది వివిధ ప్రదర్శనములలో తమ గానమాధురిచే శ్రోతల నానందింపజేసిన విద్వాన్ సరోజమ్మ (మైసూరు) కుమారి పార్వతి (మచిలీపట్టణము) గార్లకు ద్రవ్యమూలక పారితోషికములు సమర్పింపబడెను.

మహాసభ కనుబంధముగ నేర్పాటు చేయబడిన సభలలో నాయా విషయములయం దాఱితేఱిన ప్రముఖులు పలువిషయములపై ప్రసంగించిరి. మొత్తముపై ఆంధ్రావనియొక్క అన్నిమూలలనుండియు వివిధ విషయములలో పేరొందిన పెద్దలు విరివిగవచ్చి తమ రాకచేతను, అమూల్య సందేశములచేతను గ్రంథాలయ మహాసభయొక్కయునికిని సార్థకము చేసిరన్న నిందతిశయోక్తి యేమాత్రమును లేదు.

# స్వాగతోపన్యాసము

రావుసాహెబ్ రొద్దం రాజారావుగారు, బి. ఏ., బి. ఎల్.

సభ్యులారా!

పరమేశ్వరుని సృష్టిలో మానవుఁ డగ్రస్థానమును బొందినాఁడు. వాని యౌన్నత్యమునకు, విజ్ఞానసంపత్తికి గారణము గ్రంథము.

సత్కార్యాచరణకు, ధర్మప్రవర్తనకుఁ గారణము గ్రంథము. పాండిత్యమునకుఁ బరిపక్వాంతః కరణమునకుఁ గారణము గ్రంథము. సార్వభౌముని సంస్తుతిఁ గాంచుటకు సరసరస్జ్ఞుఁడగుటకు గారణము గ్రంథము. వేయేల! ప్రపంచమున గ్రంథము లేదా సర్వము శూన్యమే. ధర్మ మార్గములు, సత్కార్యాచరణనిరతి, సారస్వత సంపత్తి మొదలగునవి గ్రంథస్థములు

గ్రంథమునకు జన్మస్థానము కవిహృదయము. ఇట్టి కవులను గని పోషించిన దీ రాయలసీమ; రాయలసీమయను పవిత్రనామము మాసీమకుంచుటకు గారణము 'ఆంధ్రభోజుఁడ'ని కీర్తిఁగాంచిన శ్రీకృష్ణ దేవరాయలు పరిపాలించుటచేఁ గల్గినది.

అతఁడు కవియుఁ బండితుఁడగుటయేకాక నిరుపమాన శేముషీ సంపదాఢ్యులగు సత్కవిబృందమును దన యాస్థానమునం గూర్చుకొని తన యౌదార్యమును జాటిన రసికాగ్రేసరచక్రవర్తి. ఉ మహనీయుని సౌశీల్యరత్నములే మనుచరిత్ర, వసుచరిత్ర, పారిజాతాపహరణాదులు.

ప్రకృత మనుసరింతము. ప్రప్రథమమున గ్రంథములకు మాతృ భూమి కవి హృదయమంటినిగదా? మన రాయలసీమ యట్టి కవి పుంగవుల పుట్టుకకు నెలవైనది. గ్రంథరాజముల రచించి దిగంత విశ్రాంత కీర్తిఁగాంచు మహాకవులకు మాతృదేవత!

రాయలసీమయే యొక గొప్ప గ్రంథాలయము. నేఁడు మిమ్మెల్లర సముచిత మర్యాదలచే నాహ్వానించినది ఆ గ్రంథాలయమే. ఇఁక మీరన్ననో కొందఱు గ్రంథసృష్టి నొనర్చు మహామహులు;

మఱికొందఱు గ్రంథవిషయముల నవగాహన మొనర్చుకొన్నవారు. కాన మిమ్ముఁగూడ గ్రంథాలయములని పేర్కొన్న నతిశయోక్తి కాదు.

తుదకు దేలినది గ్రంథాలయము గ్రంథాలయముల నాహ్వానించుచున్నది. ఇంకను స్పష్టముగా జెప్పవలెనన్నఁ దన్నుఁదా నాహ్వానించుకొనుచున్నది.

ఇట్లుండ నే నాహ్వానసంఘాధ్యక్షుఁడననుట ఒక మిథ్య. కాని కారణములు కలవు.

మొదటిది నేను గ్రంథాలయ సీమయందు జన్మించియుండుట; రెండవది మా పూర్వులు గ్రంథాలయరాజములని పేరు బ్రతిష్ఠఁ గాంచియుండుట. కాన నీ అధ్యక్షపదవి వహించు హక్కు వారసత్వపు రీతిగా బరిణమించినదేమో !

గ్రంథము చేతనము. మాటాడించునదికాని, మాటాడునదికాదు.

ఆహ్వాన సంఘ సభ్యులు గ్రంథరాజాలయ కుటుంబములోఁ బుట్టిన నన్ను-ప్రాపంచిక విజ్ఞాన సంపత్తికి దోహద మొసంగఁజాలని నన్ను-యీ మూలముననైన నించుక లజ్జ వహించి సమగౌరవము నైనఁ బాటించి - గ్రంథమొక్కటియైనఁ గనునేమోయని యూహించి కాఁబోలు మిమ్మాహ్వానింప నియమించిరి. వ్యయప్రయాసల కోర్చి మాయాహ్వాన మంగీకరించి దయచేసినందుకు ధన్యవాదము లర్పించుచు మీకు స్వాగత మొసంగుచున్నాను.

హిందూపురము
29–12–42.

ఇట్లు,
రొద్దం రాజారావు
ఆహ్వానసంఘాధ్యక్షుఁడు

## తీర్మానములు

౧. ఆంధ్ర యూనివర్సిటీ హిందీ లెక్చరరు కీ. శే. ఓరుగంటి వేంకటేశ్వర శర్మగారి అకాల మరణమున కీ సభవా రత్యంతము విచారించుచు వారి ఆత్మ శాంతికై పరమేశ్వరుని ప్రార్థించుచున్నారు. మఱియు వారి కుటుంబమున కీ సభవారు తమ సానుభూతిని తెలుపుచున్నారు.

౨. ఈ సంవత్సరము చెన్నరాజధానిలోని గ్రంథాలయములకు రు 35,000-0-0 విరాళము నిచ్చిన మదరాసు ప్రభుత్వమువారి నీ సభవా రభినందించుచు, ఈ మొత్తమును కనీసము లక్ష రూపాయల వరకైనను హెచ్చించవలె ననియు, గ్రంథాలయములకు విరాళములను పంచుటలో నాయా గ్రంథాలయముల పనినిబట్టి ఉచితమైన మొత్తముల నివ్వవలె ననియు, దరఖాస్తుల బంపుకొన్న గ్రంథాలయము లన్నింటికి విధిగా విరాళముల నిచ్చున ట్లేర్పాటు చేయవలె ననియు ఈ సభవారు మదరాసు ప్రభుత్వమువారిని కోరుచున్నారు.

3. ప్రభుత్వమువారి విరాళముల పొందిన గ్రంథాలయములు వెచ్చించవలసిన మొత్తములో నివేదిక సంవత్సరారంభమునుండి వ్యయపరచిన మొత్తములు చేరవని ప్రభుత్వమువారు విధించిన షరతు గ్రంథాలయముల కిబ్బందికరము గాన దీనిని రద్దుచేయవలసినదిగ ఈ సభవారు మదరాసు ప్రభుత్వమువారిని కోరుచున్నారు.

ర. ఇతర విశ్వవిద్యాలయములు క్రొత్తగ గ్రంథాలయ శిక్షణ తరగతుల నేర్పాటు చేయుచుండగ ఆంధ్ర విశ్వవిద్యాలయమువారు కొంతకాలము వీనిని సాగించి నిలిపివేసినందుల కీ సభవారు తమ విచారమును వెలిబుచ్చుచు, తిరిగి గ్రంథాలయ శిక్షణ తరగతులను వెంటనే ప్రారంభించవలసినదిగ ఆంధ్ర విశ్వవిద్యాలయాధికారులను కోరుచున్నారు.

౫. ఆంధ్ర యూనివర్సిటీ యేరియాలోని కళాశాలా పాఠశాలా గ్రంథాలయములను, ఆంధ్రదేశమునందలి తదితర గ్రంథాలయ

ములను పరిశీలించి వాని సక్రమ నిర్వహణకు తోడ్పడు సలహాల నొసంగుటకై సమర్థుడగు నొక సుశిక్షిత గ్రంథ భాండాగారి నేర్పాటు చేయవలసినదిగ ఆంధ్ర విశ్వవిద్యాలయమువారి నీ మహాసభవారు కోరుచున్నారు.

౬. ఆంధ్రదేశములోని గ్రంథాలయముల అభివృద్ధికై చిర కాలమునుండి విడువక కృషి సల్పుచున్న ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘమున దేశమునందలి గ్రంథాలయములు, పఠనమందిరములు, స్థానికసంస్థలు, సహకారసంఘములు, విద్యాభిమానులగు వ్యక్తులు సభ్యులుగ చేరి ఆంధ్రజాతీయ వికాసమునకు, గ్రంథాలయోద్య మాభివృద్ధికి తోడ్పడవలసినదిగ ఈసభవారు ఆంధ్రదేశీయులను, ఆయాసంస్థల నిర్వాహకులను కోరుచున్నారు.

౭. (అ) ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘమువారిచే నిర్వహింప బడు గ్రంథాలయ శిక్షణతరగతులలో చేరి తమ పనిలో ప్రవీణతను సంపాదించి తమ విధిని చక్కగ నెరవేర్చుటకై గ్రంథాలయముల నిర్వాహకుల నీ సభవారు హెచ్చరించుచున్నారు.

(ఆ) స్థానికసంస్థలు తమ గ్రంథాలయోద్యోగులను ఈ శిక్షణ తరగతులకు బంపవలసిన దనియు, ఇందుకు తగిన సదుపాయములను వారికి కలుగజేయవలసిన దనియు నీ సభవారు కోరుచున్నారు.

(ఇ) ఆంధ్రదేశమునందు గ్రంథాలయ శిక్షణతరగతులను విరివిగ నడపుటకు విద్యాపోషకులగు శ్రీ శ్రీ శ్రీ జయపురం మహారాజా విక్రమదేవ వర్మగారిని ఉదారముగ విరాళము నిప్పించవలసినదని ఈ మహాసభవారు ప్రార్థించుచున్నారు.

౮. ఆంధ్రదేశ గ్రంథాలయసంఘమువారు ప్రచురించు గ్రంథా లయ పత్రికను, ఇతర వాఙ్మయమును తెప్పించుకొని తమపని నెక్కువ దక్షతతో నిర్వహించుకొనవలసినదిగ ఆంధ్రదేశమునందలి గ్రంథాలయ పఠనాలయములను, గ్రంథాలయ సేవకులను ఈ సభవారు కోరు చున్నారు.

౯. జనసామాన్యమున కుపకరించు వివిధవిషయములపై ప్రవీణులచేత కరపత్రములు వ్రాయించి గ్రంథాలయములద్వారా వీనిని ప్రచారము చేయవలసినదిగ ఈ మహాసభవారు ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘమువారిని కోరుచున్నారు.

౧౦. ఆంధ్రదేశమునందలి గ్రంథకర్తలు, ప్రచురణకర్తలు మన పూర్వగ్రంథములను ప్రచురించుటయే గాక ఆధునికమగు వివిధ శాస్త్రవిషయములపై గ్రంథములను వ్రాసి, వ్రాయించి, ప్రచురించి చౌకగ జనుల కందజేయువిషయమై శ్రద్ధ వహించవలసినదిగ ఈ మహాసభవారు కోరుచున్నారు.

౧౧. రావుసాహెబ్ గోటేటి జోగిరాజుగారు వ్యవసాయ విజ్ఞాన ప్రచారవిషయమై గావించు కృషి నీ మహాసభవా రభినందించుచు వారి గ్రంథముల తమతమ గ్రంథాలయములలో నుంచి రైతు లోకములో వీనిని వ్యాపింపజేయవలసినదిగ ఆంధ్రదేశములోని గ్రంథాలయ నిర్వాహకుల గోరుచున్నారు.

---

# ప్రచారశాఖా సమావేశము

## అధ్యక్షోపన్యాసము


## శ్రీ గాడిచర్ల హరిసర్వోత్తమరావుగారు, ఎం. ఏ.

ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘాధ్యక్షులు


'సత్యంవద', 'ధర్మంచర' అని మనపెద్దలు వేదాలలోనే అనుశాసించిరి. కాని వారంతటితో తృప్తిపొందలేదు. ఆ అనుశాసనాన్ని లోకముచేత అనుసరింపజేయడానికి వేయివిధాల ప్రచారము చేసినారు. కథలు, పురాణాలు, నాటకాలు, పద్యాలు, పాటలు ఎన్నెన్నో యుగయుగములలోను కల్పించి ఈ మాటలు మానవుల చెవికెక్కునట్లు ప్రయత్నపడినారు. ఇంత ప్రయత్నముతో గూడ ఈ అనుశాసనాన్ని అతిక్రమించేవారికి నరకాలు కల్పించి భయమును కూడ సాధనంగా ఉపయోగించినారు. అంటే నయాన భయాన రెంటను సంఘానికి మానవుణ్ణి ఉపయోగపడేటట్లు చేయడానికి పడరాని పాట్లన్నీ పడినారు.

తరతరాలుగా యుగయుగాలుగా మన పెద్దలు చేసిన యీ పనియంతా ప్రచారకార్యక్రమానికి దృష్టాంతము. నిజానికి భారతభూమిలో పుట్టిన శిశువు ప్రపంచములో ప్రవేశించినది మొదలు దేహము వదలిపెట్టేవరకు గూడ అహరహము 'సత్యంవద' 'ధర్మంచర' అనే ముక్కల యాము అతని చెవికి గోచరము అగుచుండుటకు తగిన ఏర్పాటులు మనవారు చేసిరంటే ప్రచార కార్యక్రమంలో మన పెద్దల కెంత విశ్వాసముండినదో స్పష్టపడుతుంది. ప్రహ్లాదుడు తల్లికడుపులో ఉండగానే అతనికి ధర్మోపదేశము జరిగిందట! ఉపదేశము, ఉపదేశము, ఉపదేశము, ఇదే మన పూర్వీకుల సాధన. అక్షరము నేర్చినతోడనే ఏ గ్రంథము తిరగవేసినా మన వాఙ్మయములో ఈ 'సత్యంవద', 'ధర్మంచర' అను సందేశపు టర్థమును స్ఫురింపజేసే ఘట్టాలే కంటికి గోచరింపక తప్పవు.

కన్ను, చెవి, ఒకటి రూపాన్ని, ఒకటి శబ్దాన్ని మనసున కందించడముచేత ఇవి జ్ఞానవిజ్ఞాన సాధనకు ముఖ్యమయిన ఇంద్రియాలుగా ఏర్పడినవి. లలితకళ లనిపించుకొన్న సంగీతము, కావ్యము, చిత్రము, శిల్పము ఇవి యన్నిటి యాస్వాదనానికిని ఈ రెండంగాలే సాధనాలు. కాబట్టి మనస్సుకు ఎక్కి చిత్తవృత్తిని సంస్కరింపవలసిన ఏపని సాధింపబూనినప్పటికిని ఈ రెండు అంగాలనే పరమాధారంగా మన పెద్ద లుపయోగించినారు. మనమును ఉపయోగించవలసి యున్నది.

వీటి యుపయోగములో ఏది ముందు, ఏది వెనుక, ఏది ముఖ్యము, ఏది అముఖ్యము అనే తర్కములోనికి దిగ నవసరములేదు. నిజానికి అన్ని యనుభవముల కూడికే మానవుడు. ఈ యనుభవముల పూర్వాపర్య నిర్ణయాలు చేయబూనడము మానవ

జీవిత ప్రవాహాన్ని విభాగించడ మవుతుంది. ఉన్న సాధనాలన్నిటిని సాధ్యమయినది సాధ్యమయినప్పుడు ఉపయోగించి మానవ జీవితాన్ని పరిపక్వావస్థ చెందించు ప్రయత్నం చేయవలసి యున్నది. 'వ్రతానా ముత్తమం వ్రతం' అని ఒక్కొక్క వ్రతానికిని దానిదాని స్థలంలో ఉత్తమత్వము చెప్పినట్లు 'సాధనానాం ఉత్తమం సాధనం' అని మనము చెప్పుకోవలసి వస్తుంది.

శ్రవణవిధానము మనకు అనుశ్రుతంగా వచ్చింది. అంటే చక్షురింద్రియోపయోగమును మనవారు ప్రోత్సహింపలేదని అర్థముకాదు. మన దేశములోని అజంతా, ఎల్లోరా, మహాబలిపురము, అమరావతి, లేపాక్షి ఇత్యాది సుప్రసిద్ధ స్థానాలలోని శిల్పములు, చిత్రములు, ప్రపంచ ప్రజల నందరిని ఆకర్షించినవి. మన ప్రాచీన దేవాలయాల శిల్పము, గుళ్ళ గోడలు పై కప్పులమీది చిత్రాలు, తుదకు రథాల మీద వేసే కప్పు గుడ్డలపైన చిత్రాలు అన్నీ కంటి నుపయోగించి మానవుని జ్ఞానవంతుని జేయ నేర్పడిన సాధనాలే.

పాశ్చాత్య దేశాల సంపర్కముచేత అచ్చుయంత్రాల వ్యాప్తిచేత, గ్రంథ సామగ్రి పెంపుదలచేత చక్షురింద్రియోపయోగము అంటే అక్షరరూప దర్శనము అనే ప్రత్యేక భావ మేర్పడియున్నది. ఆ భావాన్ని కూడ మన పెద్దలు గ్రహించిరి. వారు అక్షరమును బ్రహ్మగా వ్యవహరించిరి. 'అ' 'ఉ' 'మ్' లతో చేరిన ఓంకారమును ప్రత్యక్షము చేసుకోడమే బ్రహ్మను సాక్షాత్కరింపజేసుకొనడ మనిరి. వర్ణమాలలోని ప్రత్యక్షరమునకును ఒక విలక్షణమగు తాత్త్వికసంబంధ మేర్పరచి దానిని మోక్షప్రదము కావించిరి. కాని మనకు సంభవించిన పరాధీనత కారణంగా మనలో అక్షరజ్ఞతే నశించిపోయి ఎన్నడయినా మనవారు అక్షరజ్ఞులుగా ఉండిరా అనే సందేహములో పడిపోవలసిన దుర్గతి మనకు పట్టినది. అశోకమహాచక్రవర్తి బౌద్ధధర్మాన్ని అక్షరాలలో శిలలమీద చెక్కించి స్థాపించినాడంటే నూటికి నూర్గురు చదువుకొనగలరని తెలిసి చెక్కించినాడు గాని తాను చెక్కించింది తానొక్కడు చదువుకొని ఆనందించడానికి చెక్కించినది గాదే! అక్షరజ్ఞతకు మనదేశములో ప్రాముఖ్యత ఉండలేదనే వాదము వట్టి భ్రమ యని నిరూపించడానికి ఇంతకంటె ఎక్కువ సాక్ష్యము కావలెనా ?

అయిన అక్షరము అనేటప్పటికి అది రూపకల్పన యగుచున్నది. అందులోనూ ఇది చిలుకను వ్రాసినట్లు, సింహమును వ్రాసినట్లు, సుందరస్త్రీని చిత్రించినట్లు, తీర్చే రూపకల్పన కాదు. ఏనాడో సహజవస్తువుల బొమ్మలే అక్షరాలుగా ఉపకరించినవన్నమాట కలదు కాని నేడు అక్షరాలు — ఏభాష వర్ణసమామ్నాయము నాలోచించినా — వట్టి సాంకేతికాలుగానే ఏర్పడినవి. సహజరూపాలను చిత్రించే శిల్పకళలోనే కాలము మార్పుతో సాంకేతికా లేర్పడి అందులోని పండితులు 'దీని భావమేమి తిరుమలేశా?' అని ప్రశ్నించుకొని దొమ్ములాడే పరిస్థితి సంప్రాప్తించినది! అక్షరసమామ్నాయాలలో అట్టి దొమ్ములాటకు తావులేదు. కారణ మేమంటారా?

ఇందులోని సాంకేతిక తత్త్వము స్థిరపడిపోయినది. వీనికి కట్టుదిట్టాలు మొదటనే బాగుగా ఏర్పడినవి. కాని సాంకేతికాలు సాంకేతికాలే. పుట్టిన పిల్ల సహజంగా ఇతరులు చెప్పక తల్లిమాటలను, తల్లి ముఖాన్ని పోల్చుకొన్నట్లు పోల్చుకోడానికి రానివి.

అందుచేత కన్ను గ్రహింపవలసిన అక్షరము ప్రచారము కావలసి యున్నప్పటికిని మరియొకరి నోటిమాట శ్రవణేంద్రియము మూలకంగా మానవుని మనసున కెక్కి చక్షురింద్రియానికి శిక్షణ నివ్వవలసి యున్నది. కాబట్టే జ్ఞానవిజ్ఞాన సాధనకు నేటి పరిస్థితులలో అక్షరజ్ఞత అత్యవసరమయియున్నా మన దేశములో అక్షరజ్ఞత అడుగంటి యుండడముచేత దాని పునరుద్ధరణకును తద్వారా గ్రంథాలయ పఠనాలయోద్యమ విజృంభణమునకును ప్రజలను పురికొల్పడానికి ముఖ్యంగా వారి చెవులలోకి దూరేట్లు గొప్ప ప్రచారము చేయడ మవసరము. అక్షరజ్ఞతవలని ప్రయోజనములు, గ్రంథాలయ పఠనాలయముల వలని ప్రయోజనము కంటికి కట్టినట్లుగా కనుపరచే పటాలు బొమ్మలు వేసి చూపి వివరించడము, మేజిక్ లాంతరు సినీమా ఫిల్ముల ద్వారా ప్రదర్శించి నచ్చజెప్పడము ఇన్నీ చేయదగినవే. ఇన్నీ చేయడము అక్షరాలు రానివారి కొరకేగాదు. అక్షరాలు వచ్చికూడ గ్రంథాలయ మెచ్చటుందో తెలియనివారు, గ్రంథాలయ మెట్లుపయోగించుకొనవలెనో తెలియనివారు, గ్రంథపు పూర్ణోపయోగము పొందడానికి ఏవిధంగా దానిని ఉపయోగించవలెనో తెలియనివారు చాలమంది యున్నారు. అంతేకాదు. వీరిలో చాలమంది నిరక్షరాస్యతచే కలిగే నష్టాలు, అక్షరాస్యత ఉపయోగాలు కూడా తెలియక తాము నేర్చిన చదువు వ్రాత తమ యింటిలోని ఇంటిప్రక్కలోని నిరక్షరాస్యులకు నేర్పే ఉత్సాహము పొందలేకున్నారు. ఇట్టివా రందరిని ప్రబోధించడానికి చెవికి కంటికి రెంటికీ ఆనే తీక్ష్ణప్రచారం నేడావశ్యకంగా ఉంది.

ఇట్టి ప్రచారానికి అనుసరింపదగిన మార్గము లేవి? అను ప్రశ్నకు జవాబు చెప్పుకోవడములోనే మన ప్రతిభ కనుపరచవలసి యున్నది. నిజమునకు ఇదీ మార్గమని ఒక్కమార్గాన్నే చూపగల మనడము పొరబాటు. మానవుని మెదడు అన్ని శాస్త్రాలలోను క్రొత్తక్రొత్త విషయాలను కనిపెట్టుచున్నట్లే ఆ నిమిషానికి ఆ పరిస్థితికి అనుకూలమేదో ఆయా మెదడుకు ప్రచార కార్యక్రమములో తోచుతుంది, కనిపెట్టడము జరుగుతుంది. కావలసిన దేమిటంటే ప్రతి గ్రంథాలయ సేవకునిలోను తన ఉద్యమము అనంతముఖాల విజృంభించవలెననే వ్యగ్రోత్సాహము నెలకొనవలెను. అప్పుడు ఇదివరలో మనదేశములోను ఇతర దేశాలలోను తన ఉద్యమములోను ఇతరోద్యమాలలోను ప్రచార కార్యక్రమానికి అనుసరించిన మార్గము లేవికలవో తాను గట్టిగా పరిశోధించి కనుగొంటాడు. మననం చేస్తాడు. తనకుండే అనుకూలాలతో తనకు సంప్రాప్తమయ్యే భిన్నభిన్న పరిస్థితులలో తనచేతికందే పరికరాలతో ఏమి చేయవచ్చునో నిర్ణయించుకొంటాడు. దానిని సాధిస్తాడు. మనము కూర్చున్నచోట కూర్చున్నట్లుగా మనలో ఇష్టాగోష్ఠిగా మాట్లాడుతుండే మిత్రులకు ఆ మాటలలోనే

మన గ్రంథాలయోద్యమ విషయము ప్రస్తావనకు తెచ్చి సంగతులు ప్రకటించడము ప్రచారములోని మొదటిమెట్టు. ఒక్క విషయము జ్ఞాపకముంచుకొంటే ఇష్టాగోష్ఠి ప్రసంగములో ఎంత కార్యక్రమము తీర్చవచ్చునో అర్థమవుతుంది. మానవుడు ఒక్కనితో నొక్కడు ఏ విషయము మాట్లాడుకొన్నా విజ్ఞానమునకు సంబంధము కలియకుండా ఉండదు. ఏదో నాలుగు నిమిషాలలో తనపని పూర్తిచేసుకొని పోదలచి వచ్చిన వ్యవహారధోరణి మానవుని ప్రసంగమునకు దించి మనము ప్రచారము చేయలేక పోవచ్చును గాని ప్రశాంతంగా మనతో ముచ్చటించే మిత్రులకు మన మెన్నిసంగతులయినా తెలియపరచడము సులభసాధ్యము. అందువల్లనే మన పెద్దలు సత్పురుష సాంగత్యమనేది మోక్షసాధనాలలో గొప్ప సాధనంగా పేర్కొన్నారు. సత్పురుషుడంటే మొద్దబ్బాయి కాడు. ప్రపంచములోని గుణాగుణము లెరిగిన విజ్ఞుడు. ఇతరులకు మన ఉద్యమపు వెఱ్ఱి ప్రాకించవలెనంటే మనమూ అట్టి విజ్ఞులము కావలెను. మనకంటె పెద్దలయిన విజ్ఞుల దగ్గర లాభము గ్రంథపఠనము మూలకంగా, పత్రికాపఠనము మూలకంగా, సంభాషణ మూలకంగా, ఇవి ఏవీ కుదురకపోతే ఉత్తర ప్రత్యుత్తరముల మూలకంగా అపారము మనమూ పొందుతూ ఉండవలెను. మనము పొందుతూఉండే ఈ లాభాన్ని మనవద్దకు వచ్చేవారికి ప్రసంగవశాత్తుగా అందించడానికి మనమప్పుడు అర్హులుగా ఉంటాము. మనము చేసే ఉద్యమప్రచారము పటిష్ఠమవుతుంది.

ఈ యిష్టాగోష్ఠి విధానాన్ని మొదటిమెట్టన్నాముగదా! మనదగ్గరికి వచ్చేవా రెందరుంటారు? కాబట్టి మన ఉద్యమము ప్రబలవలెనంటే మనము కూర్చున్నచోటనే పని తీర్చలేము. అందుచేత ఈ ఉద్యమాన్ని మనము ఎవరికొరకు ఉద్దేశించినామో వారివద్దకు మనము తీసికొని వెళ్లవలెను. ఇంగ్లీషులో ఒక సామెత ఏర్పడియున్నది. మహామ్మదువద్దకు మహాపర్వతము రాకపోతే మహాపర్వతమువద్దకే మహామ్మదు పోవలెనట. అట్లే గ్రంథాలయోద్యమమువద్దకు ప్రజాసామాన్యము రాలేకపోతే ప్రజాసామాన్యంవద్దకు గ్రంథాలయోద్యమమే పోవలెను. ఒక్క గ్రంథాలయోద్యమము మాటే కాదు. ఏవస్తువైనా ప్రజాసామాన్యం తన్నుపయోగించవలెనని కోరితే ఆ వస్తువు ప్రజాసామాన్యాన్ని వెతుకుకొని పోవలెను. ఈ న్యాయాన్ని గుర్తించే పాశ్చాత్యదేశాలలో వస్తుసామగ్రి తయారుచేసి కోటీశ్వరులయిన పరిశ్రమాగార ప్రభువులందరు బ్రహ్మాండమయిన 'అడ్వరుటైజుమెంటు' శాస్త్రాన్ని సృష్టించినారు. ఆ శాస్త్రం మనము చూడదగింది. చదువదగింది. తుదకు మనదేశంలోని 'హాడీ బీడీలు' 'కరీం బీడీలు' ఎందరు పిల్లల కంఠాలలో ఎందరు యువకుల టోపీలు దుస్తులమీద ఎన్నియెన్ని వీధులలో మనకు ప్రత్యక్షమవుచున్నవో చూడండి. దుష్టవస్తువులతో మనకు పోలికా యని యాక్షేపింతురా ? దుష్టవస్తువులు మనలను ముంచివేయుచుండేటప్పుడు వాటి నెదుర్కొనే శక్తి విజ్ఞానసాధకమయిన మన యుద్యమానికి దప్ప ఇంకొక యుద్యమాని కున్నదా ? కాబట్టి మన యుద్యమము దుష్టప్రచారాల నన్ని

టిని మించి తాను ప్రచారములోనికి రావలెనుగదా! ఇది తప్పని పరిస్థితి. ఇందులో మనము వెనుకాడరాదు.

మనదేశము గ్రామములసీమ. మహాప్రజ నొక్కచోట చేర్చి ఉపన్యాసాలిప్పించి, ప్రదర్శనాలు పెట్టి ప్రబోధించడము సుసాధ్యము కాదు. ఇట్టి ప్రయత్నాలు జరిగినవి. జరుగుచున్నవి. జరుగగలవు. జరుగవలసినవే. మన గ్రంథాలయోద్యమ పందును మన యీ పనులు చేయుచున్నాము. రాష్ట్రసమావేశాలు, మండలసమావేశాలు, నగరసమావేశాలు, ఆయా గ్రంథాలయాల వార్షికోత్సవాలు ఇవన్నిటికిని సంబంధించి గ్రంథాలయ ప్రదర్శనాలు ఇన్నీ జరుపుచునే యున్నాము. వీనివలన మన యుద్యమము విస్తృత మవుచునే యున్నది. కాలేదన వీలులేదు. అక్కడక్కడ కేంద్రగ్రంథాలయాలేర్పడి సంచార గ్రంథశాఖ లేర్పరచి పనిచేయుచున్నవి. మన కార్యదర్శి శ్రీ నాగభూషణముగారి వ్యగ్రోత్సాహముచేత బోటు గ్రంథాలయము కూడ ఏర్పడి కాలువలమీద తిరిగే ప్రజలను ఆకర్షించే పనియు జరిగినది. గ్రంథాలయ సేవలో అగ్రగణ్యులగు శ్రీ అయ్యంకి వెంకటరమణయ్యగారు ఆరంభించిన గ్రంథాలయ యాత్ర లప్పుడప్పుడు సాగుచున్నవి. ఇన్నిటిలోను సంచార గ్రంథ ప్రయత్నము, బోటు గ్రంథాలయ ప్రయత్నము, గ్రంథాలయ యాత్ర ఇవి ప్రజాబాహుళ్యమువద్దకు గ్రంథాలయోద్యమము పోయే ప్రయత్నాలుగా ఎన్నదగినవి. వందేమాతరోద్యమఫలంగా కలిగిన ఉత్సాహములో గ్రామగ్రామములోను గ్రంథాలయము నెలకొల్పవలెననే ఉద్దేశములో గ్రామసీమలలో నూర్లకొలది గ్రంథాలయాలు ఆంధ్రదేశమం దేర్పడినందున మన ఉద్యమానికి కొంత ప్రజాసామాన్య సంబంధము ఎడతెగకుండా ఉంది. దానికి నిజంగా మనము సంతసింపవలసిందే. కాని మన చేసిన ప్రయత్నము చాలలేదు. జనసామాన్యాన్ని మనము ఒకరీతిగా సమీపించినా వారికి మనము సన్నిహితులు కాలేదని యొప్పుకొనక తప్పదు. దోషము మనదేనా? కాదు. అగును. రెండూను. మనమున్న పరిస్థితులలో మనము చదువను వ్రాయను గలవారికి గ్రంథాలయాలను పఠనాలయాలను వినియోగించుకొనే అవకాశాలు ఇవ్వదలచి తీక్ష్ణకృషి చేసితిమి. విజ్ఞానచంద్రికా గ్రంథమాలబోటి గ్రంథమాలల గ్రంథాలు, ఆంధ్రపత్రికబోటి పత్రికలు ప్రచారములోకి వచ్చెను. ఉన్నంతలో ప్రజలు గుమిగూడి పత్రికలలోని సంగతులు చదువుట వినుట సంభవించెను. కాని ప్రబోధోత్సాహ ముండడానికి ఎప్పటికప్పుడు ఏదో వారి నాకర్షించు తీక్ష్ణ పరిస్థితులు కలుగవలసి యుండినది. ఏ మహాయుద్ధమో ఏ గాంధీజీ ఉపవాస దీక్షలో, అసహాయోద్యమ కార్యక్రమమో అవసరము లయినవి. తక్కుంగల కాలములలో ఒక మాత్రపు ప్రజ చేరడానికయినా ఉద్దీపకాలు తక్కువగా నుండినవి. మనదేశములో నెలకొనిన విద్యావిధానము కారణముగానే మనము నిస్సహాయస్థితియం దుంటిమి. మన గ్రంథాలయ ప్రయత్నములోను మన విద్యాసంస్థల ప్రతిబింబమే యేర్పడడము తప్పలేదు. అథవా ఇందులో కొంత వైశేష్య ముండినదంటే అది మన ప్రాచీన వికాస వాసనకు సంబంధించినదిగా ఉండినది. హరికథో, పురాణశ్రవణమో ఇత్యాదులను

గ్రంథాలయముతో జంటించినచోట ప్రజలు గ్రంథాలయము ముఖముచూచుట సంభవించుచుండినది. కాన ఆర్థిక దౌర్బల్యము ప్రబలి కడుపు మాడుచుండునట్టి ప్రజకు ఈ యుద్దీపకముకూడ బలవత్తరముగా నుండడము కష్టము. మొత్తముమీద మన ఉద్దేశాలలో లోపములేకున్నా సంఘావసరాలను పూర్తిగా గుర్తించుటకు మనకు తగిన దృష్టి పుట్టుటకు కొంతకాలముపట్టినది. విద్యావిధానాలకు గ్రంథాలయాలకు సన్నిహితమైన సంబంధముండబట్టి ఈ కాలవిలంబము తప్పలేదు. ప్రజలలోని సామాన్యవ్యక్తికి ఆతని అనుదిన జీవితముతో లంకెగల చదువు ముఖ్యావసరముగాని గుమాస్తాగిరికి అతనిని సిద్ధముచేసే చదువు పనికిరాదను భావము మా బోంట్లము సుమారు 40 సంవత్సరాలుగా ఉద్ఘోషించుచున్నా ఆ భావము సంఘపు సొత్తయిపోవడానికి మన పరతంత్ర పరిస్థితులలో ఇంతకాలముపట్టినది. ఇంకను కొంతకాలము పట్టునేమో యని నాబోటివారి భయము. గ్రంథాలయోద్యమ చరిత్రలోనుంచే ఈ యలసతకు తార్కాణము చూపవచ్చును. లోకము ఆర్థిక సమస్యలలో పడి కొట్టుకొంటుంటే, మన రైతు వ్యవసాయంలో అత్యుగ్రంగా అమెరికాతో పోటీపడి తన వస్తూత్పత్తిని చేసి కాలూని నిలువవలసియుంటే అమెరికా దేశములోని ప్రభుత్వమునందలి వ్యవసాయశాఖకు చెందిన రెండులక్షలకు పైబడిన గ్రంథాలయ సామాగ్రి ఏర్పడి విజ్ఞానమును ప్రపంచపరిశోధన ఫలితాలను వెదజల్లుతుంటే అమెరికాలో సేద్యముచేసే ప్రతి మనిషీ అక్షరజ్ఞుడయి ఈ గ్రంథాలయ సామగ్రి ఉపయోగించుకొన కలిగియుంటే, మన దేశములో రైతుకు అక్షరం రావడానికి ప్రయత్నంజేయక, అతని వ్యవసాయానికి సంబంధించిన గ్రంథసామగ్రి సిద్ధముచేయడానికి ప్రయత్నించక రామాయణాలు భారతాలు భాగవతాలు సమకూర్చిపెట్టినామంటే అతడుపయోగించునా ? ఉపయోగించగలడా ? లేదా బళ్లలో పిల్లలకని యేర్పడిన జీబాగ్రి, ఓకు పాఠాల పుస్తకాలు ఇంగ్లండుదేశచరిత్రలు చదువుకోను పెట్టినాము చదువుకొనుమంటే అతడు చదువుకొనునా ? చదువుకొనగలడా ? నిజమే. మనకు పారతంత్ర్యమున్నది. మనకు తగినంత ప్రోత్సాహము ప్రభుత్వపక్షమునుంచి దొరకదు. అందుకని మనము చేసే పనిలో మనము బాలాజీ బాజీరావు కాలపు పంథానే అనుసరించుచుండడము సమర్థింపగలమా ? హైరుగ్రిన గంటకు 450 మైళ్ల వేగాన ఆకాశంలో విమానాలు టాంకులతో మరఫిరంగులతో ఎగురుతుండే యుగమునందు దానికి తగిన మార్గాలాలోచించకుండా రెండెడ్ల రథముమీద ఈ కెలు పెట్టుకొని యుద్ధానికి గంటకు మూడుమైళ్ల వేగముతో బయలుదేరుతామంటే పరిహాసాస్పదులము కామా ! ఆత్మహత్యకు ఉత్తమోపాయము నిర్మించుకొన్నవారము గామా ? మన గ్రంథాలయోద్యమములోనూ ఈ పొరబాటే నా కంటికి గోచరిస్తూ ఉంది. మాబోంట్లము పదులఏండ్లుగా అక్షరజ్ఞత ప్రయత్నము సాగవలసినదని మొర్రపెట్టుచున్నా గ్రంథాలయ నిర్వాహకుల కింకా దయరాలేదు. గ్రంథాలు మనకు కరవు. విజ్ఞాన శాస్త్రగ్రంథాలులేవు. దొరకవు. పత్రికలలో వస్తుండే విజ్ఞాన శాస్త్రవిషయాలనైనా కత్తిరింపులుచేసి గ్రంథస్థముచేసి చదువరులకు అందియ్యండి అంటే విన్నవా

రున్నారా ? మరి గ్రంథాలయ నిర్వహణమంటే అదీ ఒకవిద్య, ఒకకళ, దానికి శిక్షణ అవసరము. దాని ఉద్దేశాలు, పోకడలు, అందుకు తగిన పరిశోధనలు ఇన్నిటికి తగిన పరిచయము ఇన్నీ కావలె. శిక్షణాలయాలు పెట్టవలె. పెట్టుచున్నామని మీరొప్పుకుంటే దీన్నయినా ప్రబలంచేయడానికి గొప్ప ప్రయత్నం గ్రంథాలయ నిర్వాహకులు, స్థాపకులు, అభిమానులు జరిపినారా అంటే యెక్కువ తోడ్పాటు కలుగలేదు. ఇవి మూచ్ఛా ఉదాహరణాలుగా చెప్పినాను. ఇవి చెప్పడంలోకూడా ఎవ్వరిని లోపాలెంచే ఉద్దేశముతోనూ చెప్పలేదు. ఈ విషయాలలో గాఢమైన ప్రచారం జరుగవలసియున్నదని నిరూపించడానికే యింతా ప్రస్తావించినాను. దక్షిణ ఇండియా వయోజన విద్యాసంఘమునకు ఉపాధ్యక్షుడుగా వారి మద్రాసు కార్యాలయ వ్యవహర్తగా నాకు కలిగిన అనుభవము కొంత ఈ సందర్భములో వివరింపదలచినాను. వయోజన విద్యాప్రచారకులకు శిక్షణ అత్యావశ్యకమని పట్టుబట్టవలసిన దురవస్థ నా కప్పటను తప్పలేదు. మద్రాసు కార్పొరేషనువారి యాజమాన్యమున జరిగిన సమావేశాలలో విద్యాధికారులు గ్రంథాలయాల పెద్దలూ కూడ మన కార్యానికి వచ్చేవారు చదువుకొన్నవారే ఉపాధ్యాయులుపని చేసేవారేగదా వారికి శిక్షణ మళ్లీ యేమిటి అన్నారు. ఎట్లైతేనేమి ! నా బలవంతంమీద రాబోయే వయోజన విద్యా ప్రచారకులకు తొమ్మిది దినాలు ప్రత్యేకప్రబోధము చేయవలసిన దన్నారు. అచ్చటి కార్యక్రమం మా కార్యదర్శికి కొంత ఉత్తేజకాన్ని కలుగజేసింది. తరువాత ఒక మాసముదినములు మా సంఘము పక్షముననే లాబక్ అడల్టు ఎడ్యుకేషన్ ట్రెయినింగు సెంటరని సాయంకాలాలు తరగతులు పెట్టి కొందరికి శిక్షణ యిచ్చితిమి. వారిలో ఒక స్త్రీ యభ్యర్థిని మావద్ద పాఠాలు చదువుచుండగనే పదిమంది అక్షరాలు రాని సోదరీ విద్యార్థినులను తన యింటివద్ద చేర్చి చదువనేర్ప నారంభించెను. ఇది మా యువక కార్యదర్శికి హుషారు హెచ్చించెను. ఆతడు మధురలో వెళ్లి పశుమలై అనే చోట శిక్షణాలయ మారంభించెను. పిదప తన ప్రచారంలో ఉత్తరార్కాటు జిల్లాలోని ఒక డిప్యూటీ ఇనస్పెక్టరును 'పిల్వరాయి'యను వారిని ఆకర్షింపగలిగెను. వారు వీరుచే 25 గ్రామాలలో కార్యమారంభించిరి. ఇంటింటి చదువురానివారిని ఏరి ఒక్కొక్కరికే అక్షరజ్ఞత కల్పించడానికి 42 రు స్వచ్ఛంద సేవకుల సిద్ధపరచిరి. వీరిలో కొందరు పిల్లల బడిపంతుళ్లు. గ్రామసీమలవారు. ఇటీవల వీరి యుత్సాహము నేను తిరువణ్ణామలైలో చూచితిని. వయోజన విద్యనుగురించి ఈ పల్లెటూరి బడి పంతుళ్ళు నూర్లకొలది శ్రావ్యమయిన పాటలు వ్రాసినారు. చక్కగా పాడే వారేర్పడినారు. తిరువణ్ణామలై కార్తీకదీపమప్పుడు వీరితో చేరి మేము చేసిన ప్రచార ఫలితంగా వేలూరు తిరువణ్ణామలై మునిసిపాలిటీలు వయోజన విద్యా ప్రణాళిక లారంభించినవి. మరి 80 మందికి శిక్షణ నిచ్చి సర్టిఫికెటు లిచ్చుచున్నాము. ఆ ప్రాంతములో ఈ ఉద్యమము మహాజనుల స్వాధీనము చేయగలమను ఆశ అంకురించినది. ఈ మహాజన ప్రయత్నములో రాజకీయ, మత, సాంఘిక తత్త్వాల పోరాటము

లేదు. విజ్ఞానసాధక ప్రయత్నంగా ఇది సాగిపోవుచున్నది. ఈ వివరణము విన్న తరువాత తమిళులకున్న కార్యసాధనపరత్వగుణము మీకు విశదము కాగలదు. కాల గతిని కనిపెట్టుకోవడములో వారికికల ప్రజ్ఞకూడ తెలియగలదు. ఆ కార్యసాధన పరత్వము ఆ ప్రజ్ఞ మనమూ అనుసరింపదగినవి అని మాత్రము హెచ్చరించుచున్నాను. ఆంధ్రదేశ గ్రంథాలయోద్యమమునందు పనిజేయు సోదరులు మళ్లీ ప్రాతకాలపు మతాల పిచ్చిని తమ మతాలకుకూడ కల్పించుకొని అక్షరజ్ఞత వ్యాపింపజేయు కార్య మునందును వీరితో తమ రాజకీయాదిక మతములలో ఏకీభవించనివారితో కలియమని తమ యభిప్రాయాల నన్నిటినీ యెప్పటికప్పుడు వెళ్లగ్రక్కుచూ ఇతరాభిప్రాయాల వారితో జట్టీలు పెట్టుకొనడ మారంభించితే ఈ నిర్మాణ కార్యక్రమము సాగదు. నిజానికి ఏ నిర్మాణక్రమమును సాగదు. అందుచేతనే గాంధీజీ అతని నిర్మాణ క్రమాన్ని రాజకీయేతరము చేసివేసినాడు. అతడు నొక్కి చెప్పుతుండే ఖద్దరుద్యమము నిరాక్షేపణగా జరిగిపోవడానికిదే కారణము. ప్రబోధము జరుగడానికి ఆయుద్య మముకంటె అక్షరజ్ఞతా ప్రచారములను గ్రంథాలయ పఠనాలయోద్యమమును ఎక్కువ చక్కని తోరకాలు. విజ్ఞాన ప్రచారదృష్టితో ఈ యుద్యమము నడిపిన యెడల ఆవిధముగానే దీనిని నడుపదగును. ప్రపంచములోని అన్ని యుద్యమాల సంగతి, అన్ని శాస్త్రాలసంగతి, అన్ని కళలసంగతి, అన్ని పరిశ్రమలసంగతి, అందరు మహాపురుషులసంగతి, అన్ని మహాసంఘవాలసంగతి, అన్ని యభిప్రాయాలసంగతి నిరాఘాటంగా ప్రచారము చేయడానికి వీలున్నది. విజ్ఞాన ప్రచారకునికి విజ్ఞాన ప్రచారము చేయడమే ఆవేశము. ఎదుటివాడు దేనినిగురించి వివరము అడిగితే దానిని గురించి తెలియజెప్పడమే పరమాగతి. తనలోని గొప్పను ప్రకటించుకోవడము అతని పనికాదు. తనమాట జరుగలేదని ఒకడు తన్ననుకరించలేదని కినిసిపడడము అతనికి ఉచితశీలము గాదు. అతని రక్తములో దౌర్జన్య మెచ్చటును నిలిచియుండడానికి వీలు లేదు. ఇతరులు—అన్నిరకాలవారు, అన్ని ఆవేశాలవారు—తన్ను హింసించినా చిరు నవ్వుతో వారి కినుకను మరల్చి వారికి విజ్ఞానసాధనాలు చూపించడమే అతని ధర్మము. ఈ విధ మనోప్రవృత్తికల వయోజన విద్యాప్రచారకులు చచ్చుమనుష్యులు గారు. ఎదుటివానిలో గల వ్యక్తిత్వపు స్వాతంత్ర్యమును తమ స్వాతంత్ర్యమువలెనే గుర్తించిన యుదారులు. ఎదుటివానిలోని వ్యక్తిత్వము అతని ప్రయత్నము మూలకముగానే పుష్టి నందిననేగాని ప్రపంచపురోగమనానికి మార్గములేదని గుర్తెరింగిన ధీవిశాలురు. ప్రజా సత్తాకపు పరమాధారము తెరింగిన ప్రజ్ఞావంతులు. ఇటువారి నొకవ్వడు లోక మర్గము చేసికొనలేకపోవచ్చును. తమ పక్షమునందు గట్టిగా పూనుకొనలేదని వీరిని దూరముచేయు దగ్గరి మిత్రులుకూడనుందురు. అందుచేత నష్టముకల్గుచున్నదని వీరు వాపోవనక్కర లేదు. తమ ధర్మము తాము నెరవేర్చితిమన్న కృతకృత్యత వీరికి చాలును. ఈవిధ దృష్టి, మనోవృత్తి, శీలములు గ్రంథాలయోద్యమాదర్శములని ప్రచారము జరుగవలసి యున్నది. ఈ యాదర్శసాధనకు గ్రంథాలయసేవకుల కెంతటి శిక్షణయవసరమో మనము గుర్తింపవలసియున్నది. మన యాదర్శములు, మన శిక్షణవిధానము, మనము

ప్రజలకుచేయు సేవా స్వరూపము ఇన్నికూడ మనమందించే పుస్తకాలు, పత్రికలు, ఇతరోపకరణాలవలెనే గొప్ప ప్రచారము పొందవలెను. మనముచేసే ప్రయత్నము ప్రపంచమున మానవుడు జీవము గడపడానికి మోక్షముపొందడానికి ఆధారభూతమయిన ప్రధాననిర్మాణ ప్రయత్నమని లోకమున ప్రతిధ్వనించిపోవలెను. అప్పుడే మన యుద్యమమునకు నిండు జీవకళయుండగలదు. అప్పుడే మనము పూర్ణసేవ చేయగలము. అప్పుడే దేశలాభము ప్రజాలాభము నేటికంటె పదిరెట్లెక్కువగా సాధించడము జరుగగలదు. శుభమగుగాక !

---

## సంచార గ్రంథాలయము

**శ్రీ పాఱ్నంది జే. లక్ష్మీపతిశాస్త్రిగారు, తనకల్లు**

"నహిజ్ఞానేన సదృశం పవిత్ర మిహవిద్యతే"

వాఙ్మయ మనంతవనధి. గ్రంథములందలి వీచికలు. అందుండు నిర్మల సత్యజ్ఞాన మనంత పరబ్రహ్మస్వరూపము. గ్రంథాలయము పరమపదము. తదుపాస్తి పరబ్రహ్మసేవ. తజ్జన్యము బ్రహ్మానందము.

"సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ."

వేదపురాణ కాలములలోఁ దన స్వచ్ఛస్ఫటిక సదృశ హృదంతర నిలీన తేజః పుంజములచే, ఖండఖండాంతరముల కన్నులఁ దెఱపించినది మన భరతఖండము. మనుష్యుని దైనందిన జీవితము మొదలు, పరబ్రహ్మస్వరూపతత్ప్రాప్తి సాధనాంతముగల విషయ మీమాంసల కాటపట్టు మన వాఙ్మయము. చతుర్వేదములు, చతుష్షష్టికళలు, స్మృతిపురాణములు, ఇవి యవి యననేల, భౌతికాధ్యాత్మిక విద్యలన్నిటియందు వారితేరిన దార్యజాతి. నాటికి నేటికి నార్యజాతి సాటివారి తలలోని నాలుకయై మెలఁగుట మన భాగ్యము.

ఆర్యులకీ ప్రశస్తి యాకస్మిక మనజాలముగదా! ఇంక వారి సంసాధన సిద్ధమని యొప్పుకొనక తప్పదు. ఈ సాధన నిరంతర విషయ భావనారూపము.

ప్రాక్కాలమున మనవారికి తమ భావనలకు సిద్ధాంతములకు శాశ్వత రూపమునిచ్చుట కిప్పుడు మనకున్నంత సాధన సామగ్రి

లేకున్నను, వారు వానిని యుగయుగాంతరములుకాదు ఆకల్పముండు సృష్టి కుపయోగపడు పద్ధతుల భద్రపఱచిరి.

ముఖ్యముగ నోకరి కొకరు వాచాచెప్పికొని విషయము కంఠస్థమొనర్చుకొనుచుండిరి. వారికి తెలిసినవిషయము వారిలోనే లయింపనీక పలువుర కుపయోగించురీతి కథలమూలముననో, యుపన్యాసముల మూలముననో, సంతజెప్పుపద్ధతినో యితరులకు బోధించి యులవఱచుచుండిరి. అప్పటి రచ్చకట్టల పురాణములు, హరికథల సంబరములు, ప్రచారకుల దేశసంచారములు, పండితుల పరస్పర విజిగీషాడంబరముల కథలను విన్నచో, నప్పటివారు విద్యావ్యాప్తికై యెంత పాటుపడుచుండిరో మనకర్థము కాగలదు.

పూర్వకాలము విద్యావ్యాప్తి యెంతయున్నత స్థితియందుండినది, వారెట్లు తత్ప్రచారము సాగించుచుండిరనుకొనుట కొక చిన్న విషయమిందుఁ జెప్పెద. మన యిండ్లయందుండు ముసలమ్మలకు అక్షరజ్ఞానము లేకున్నను వారికి తెలిసినన్ని రామాయణ భారత భాగవత కథలు, సామెతలు, భాషయొక్క నుడికారపు సొగసు ఇప్పటి మన వారిలో నెందఱకు తెలియును? మన మెన్ని గ్రంథములు తిరుగఁద్రిప్పినను సంప్రదాయ సిద్ధముగ నలవడిన యా జ్ఞానము నిర్దుష్టమైనట్లు మన జ్ఞానము నిర్దుష్టమను కొనఁగలమా?

అది యటుండనిండు. ఆకాలముపోయినది. పరిస్థితులు మారినవి. జ్ఞానవ్యాప్తికి కావలసినన్ని సౌకర్యము లిప్పు డున్నవి. పెద్దపెద్ద గ్రంథము లచ్చొత్తి విక్రయించఁబడుచున్నవి. అందరి కంనుబాటులో నున్నవి. ఇప్పుడేల పెక్కుఱు వానిని క్రమముగ వినియోగించుకొనుటలేదు అను ప్రశ్న కొకటే ప్రత్యుత్తరము. నిరంతర దాస్యబద్ధులై, వ్యక్తిత్వము గోల్పోయి, బ్రతుకొక భండనముగా కాలము గడుపవలసి వచ్చుట, తత్కారణముగ గ్రంథపఠనాభిలాష సన్నగిలుట.

కాగా, సన్నగిలిన—కాదు స్వరూపనాశనమైన యీ గ్రంథపఠనాసక్తిని ప్రజల హృదంతరాళములలో సంచలింపఁజేసి యుద్దీపింప

జేయు టెట్లు? అదిగాకున్న భారతజాతికి భవిష్యత్ప్రపంచములో నుచ్చైస్థానము నాకాంక్షించు టెట్లు? ఈ సమస్యాపరిష్కార మంత సులువు గాకపోయినను నసాధ్యము మాత్రము గాదు. దీనికి ముఖ్య సాధనము, వివిధప్రాంతములందలి సర్వవిషయిక లిఖిత, ముద్రిత గ్రంథముల నన్నిటిని దెప్పించి, యూరూర గ్రంథాలయముల నేర్ప అచుట; అచ్చటికి ప్రజల నాకర్షించి వారికి గ్రంథపఠనమం దాసక్తి కలిగించుట. క్రమక్రమముగ వారికిట్టి తర్బీతు నిచ్చిన కొంతకాలమున పఠిత కది యొక యమూల్య విషయముగ గోచరించగలదు. పరబ్రహ్మా నంద పరవశుడై బాహ్యమును సర్వమును మఱచు యోగివలె, గ్రంథ రసాస్వాదనాయత్త చిత్తుడైన మనుజుడు తదితరమును సర్వమును మఱువఁగలడనుట యనుభవదూరము గాదు.

గ్రంథాలయములు పెద్దపెద్ద పట్టణములలో నెలకొల్పుట సాధ్యము. అక్షరజ్ఞానము గలవారికి గ్రంథాలయము లుపయుక్తములు. తదితరుల కవి యెట్లుపయోగపడగలవను సందేహము మనలో పెక్కుఱ కుండవచ్చును. కాని యీ సందేహము గ్రంథాలయముల నుపయోగించుకొను రీతి, వానిని ప్రచార మొనరించు పద్ధతి నెఱుగని మూలమున కలుగునది.

హిందూదేశములో ప్రస్తుత మక్షరాస్యుల సంఖ్య చాల తక్కువ యనుట నిజమే. కాని దానిని నిర్మూలించుటే గ్రంథాల యావశ్యకత. సాధ్యమైనయెడల చిన్నచిన్న పల్లెలందుకూడ గ్రంథాలయముల నెలకొల్పవచ్చును. ఈ పనికి కొంత యుత్సాహము పట్టుదల యావశ్యకము. సహజ పరోపకార పారీణులైనవా రీపని గావింప గలరు. అట్టివారు గ్రంథములందలి యంశముల నా యా గ్రామములందలి ప్రజలకు రుచించురీతిని తెలియఁజెప్పి యా విషయమంతయు గ్రంథపఠనమువలన తెలిసినదని చెప్పవచ్చును. వారి కప్పుడు స్వాయముగ గ్రంథపఠన వాంఛ గలిగి, తత్సాధనమైన యక్షరజ్ఞానమును సంపాదించుటకై ప్రయత్నింతురు. నిరక్షరాస్యతను నిర్మూలించి విద్యావ్యాప్తికి తోడ్పడుట కిది యొక సాధనము.

ఇంక గ్రంథాలయము లుండుచోటికిఁ బోయి, నిర్ణీతకాలమున గ్రంథముల దీసికొని పఠించు తీరిక లేనివా రుందురు. ఈ తెగకు చేరినవారు చాలభాగము స్త్రీలు, పల్లెటూరివారు. అట్టివారి యుపయోగార్థము గ్రంథముల నింటింటికిఁ దీసికొనిపోయి, గ్రంథములందలి విషయవులను తత్ప్రాశస్త్యమును వారికి నచ్చఁజెప్పి, వారిచే గ్రంథముల చదివింపఁజేయుట యొకసాధనము. ఇట్లొనర్చునవి సంచార గ్రంథాలయములు (Circulating Libraries).

ఇవి కేవలము పట్టణములందలి ప్రజల సేవజేయుటకేగాక, గ్రంథాలయములు లేని చిన్న చిన్న పల్లెటూరివారికి గ్రంథముల నందుబాటులోనుంచుటకు తోడ్పడును. గ్రంథాలయ సేవకుడు ప్రతిదిన మొక చిన్న బండిలో (చేతితో నీడ్చదగినది) పల్లెటూరిప్రజల నాకర్షింపగలిగిన (నాటకములు, కథలు, పల్లెపదాలు, తందానకథలు, బొబ్బిలిపాటలు, వినోదకథలు మొదలైనవి) గ్రంథముల కొన్నిటినిఁ దీసికొనిపోయి పల్లె రచ్చకట్టవద్ద విడిదిచేసి, యూరివారి నాకర్షించవలయును. గారడిపనులు చేయువాడు, చక్కెర చిలుకలమ్మువాడు ప్రజలగుంపును, పిల్లలను తనదగ్గఱకు పలుగెత్తించుకొనుట కెట్లు డోలు, డమారము, చిఱుగంట మొదలైన సాధనము లుపయోగింతురో, గ్రంథాలయ సేవకుడును నట్లె గ్రామస్థుల నాకర్షించు ఫణితులలో వ్రాసిన (తందాన ఫణితి—ఏల పదాలవరుస మొదలైన గ్రంథాలయోపయోగముల చాటునవో, గ్రంథపఠనమునుగూర్చి తెలుపునవో) పాటలఁ బాడి ప్రజల నాకర్షింపవలయును. ఒక్కొక్కప్పుడు తులసిపాట, కమలవల్లిపాట మొదలైన చిల్లరపుస్తకములమ్మువాడు ఆ గ్రంథములలోని విషయమునే నోటఁ బాడుచు పుస్తకముల కొనుట కభిరుచి కలిగించునట్లు గ్రంథాలయసేవకుడును తాను గొనిపోయిన గ్రంథములందలి విషయ సారమునే సంగ్రహాముగ నుపన్యసించుచు, తద్గ్రంథపఠన సౌముఖ్యమును వారికి కలిగించుట బాగు. ప్రతిదినము నాత డొక్కొక పల్లెవంతున దిరుగుచు, వారమున కొకసారియో లేక మాసమున కొకసారియో యొక్కొక పల్లెకు వంతు వచ్చునట్లు చూడ

వలయును. ఇట్లు చేసినచో గ్రంథాలయముల యుద్దేశము సంపూర్ణము కాగలదు. గ్రంథాలయోద్యమములో సంచార గ్రంథాలయములకు ప్రముఖస్థానము గలదనుట నిర్వివాదాంశము. స్థాయీ గ్రంథాలయములు చేయు సేవకన్న సంచార గ్రంథాలయములు చేయు సేవ యెక్కువైన దనవచ్చును.

అసలు గ్రంథాలయోద్యమమే కేవల సాత్త్వికయుతమైన నిష్కామకర్మ. స్వార్థత్యాగులే దాని సేవ బాగుగ నొనర్పఁ గలుగుదురు. అట్లుగాక స్వార్థపరులైన ప్రతిష్ఠాకాంక్షు లీ యుద్యమమును చేబూని నడపఁజూచినచో నది సభావేదికలపై నుపన్యాసములతో ముగియునే కాని నిజమైన సేవగా నేరదు. అట్టివారు రాజసప్రియులు. రాజసము ఉత్కృష్టఫలప్రాప్తికిగాక నికృష్టఫలప్రాప్తికి మాత్రమే సాధనమగుచున్నది.

అట్టిచో సంచార గ్రంథాలయ సేవకుఁడు గ్రామస్థుల సౌముఖ్యమును సంపాదించుకొను నూహాలతో మానసికముగ, వారికి నచ్చు జెప్పురీతుల వాచకముగ, పల్లె పల్లెలు విసుగనక శ్రమయనక దిరిగి కాయికముగ, త్రికరణశుద్ధిగ శ్రమపడవలసియుండును. అట్టివాని మనస్తత్వమెంతో సంస్కారయుతమై యుండకున్న నాత డింతటి మహోత్కృష్టకార్యభారము నెట్లు నిర్వహింపగలఁడు?

మనదేశములో గ్రంథాలయోద్యమము ప్రారంభమై పెక్కు సంవత్సరములైనను, సంచార గ్రంథాలయోద్యమము మాత్రమింకను ముసుగును వీడకుండుట శోచనీయము. కారణము పైన నుడివినట్లధిక పరిశ్రమ సాధ్యమగుటయే యని తోచుచున్నది. అది యెట్లున్నను సంచార గ్రంథాలయముల యావశ్యకత యితరములకన్న నిప్పుడే యెక్కువగా గలదనుట స్పష్టముగ కన్పట్టును. పట్టణవాసులగు ప్రజలకన్న పల్లెటూరివారిసంఖ్య దేశమున హెచ్చు. పల్లెటూళ్లలో విద్యావ్యాప్తి బొత్తుగ లేదనవచ్చును. ప్రజల విద్యావిహీనతచే దేశము మిక్కిలి దుర్బలమగుచున్నది. ఆర్థికముగ, వైజ్ఞానికముగ,

రాజకీయముగ, కాయికముగ దేశ మింతక్షీణస్థితికి వచ్చుట అక్షర జ్ఞానశూన్యతామూలకమే! కనుక గ్రంథాలయ సేవకులు పల్లె పల్లెలలో ప్రచారముఁజేసి విజ్ఞానము కలిగించు విధానములు నవలంబించవలసిన రోజులివి. ఈ సేవయే దేశసేవ. విశ్వమానవసేవ—విశ్వరూపిసేవ. పరబ్రహ్మోపాస్తి.

---

## గ్రంథాలయ వ్యాప్తి

శ్రీ మాడుగుల అశ్వత్థనారాయణగారు, బి. ఏ.
ధర్మవరము

భారతవర్షంబున చరిత్రాంశంబుల దిలకించినను యుక్తి పరికించినను దేశాభ్యుదయంబునకు భాషాభివృద్ధియే ప్రథమ సాధనంబని తెలియుచున్నది. భాషాభిమానంబు లేని రాజ్యముకాని భాషాభివృద్ధి లేని దేశముగాని యభివృద్ధి పొందినట్లు యే చరిత్రయందు కానరాదు. ఏదేశము నాగరకతాభివృద్ధితో సకల సంపదలతో జ్ఞాన సంపత్తులతో తుల దూగుచున్నదో ఆ దేశము తప్పక భాషాభివృద్ధి గాంచిన దనియే యెరుంగవలయును. ఇటి పరిస్థితి గమనించియే ఇట్టి సర్వోత్కృష్టత గ్రహించియె పాశ్చాత్య దేశంబుల ప్రతి పట్టణమునందు, గ్రామములయందు, తుదకు యింటింటను భాషాభివృద్ధి కనువగు జ్ఞానసాధకంబగు గ్రంథాలయంబుల వెలయింపజేసి ప్రపంచమందలి జాతులలో నాగరికాగ్రగణ్యులై వినుతికెక్కిరి. మన దేశము ఔన్నత్యదశ పొందుటకు భౌతికాధ్యాత్మికంబుల తెలిసికొనుటకు స్వాతంత్ర్యము పొందుటకు నీ గ్రంథాలయంబులే ముఖ్య సాధనము లగును.

అజ్ఞానమను అంధకారమును పారదోలునటువంటి వెలుంగైన విద్య ఎల్లరకు ఒక్కతీరున అలవడదు. పాఠశాలవిద్య యే కొందరకో ధనార్జనకొరకు కృషి సల్పువారికి ఎక్కువగా లభించుటకు అవకాశమున్నది. కులవృత్తిని విడువక జ్ఞానంబుకొరకు అభ్యసించువారికి పాఠశాలకన్న గ్రంథాలయంబుల నెక్కువ అవకాశమున్నది. పాఠశాలలందు అలవడు జ్ఞానము స్వల్పము. గ్రంథాలయ విద్యయే స్వాతంత్ర్యమునకు లోకకళ్యాణమునకు పాటుపడుటకు వలయు త్యాగము మొదలగు ఉత్కృష్టములైన శక్తులను ప్రసాదింపజేయును. అందువలననే దేశాభ్యుదయమునకు గ్రంథాలయవ్యాప్తి ముఖ్యము.

దేశమునందు భక్తిరసమును ప్రసాదించుటకుగాను, దైవభక్తి ప్రజలయందు నెలకొల్పుటకుగాను ప్రతిగ్రామమునందు దేవాలయములు నిర్మింపబడి అందు లక్ష్మి విష్ణువు మొదలగు అధి దేవతలు ప్రతిష్ఠగావింపబడినవి. అధిదేవతకు స్థిరత్వమేర్పడి

నందువల్ల భక్తిలేని నాస్తికులకుగూడా భక్తియెడ మనస్సు త్రిప్పించుటకు అవకాశ ముండును. అటులనే విద్యాధిదేవతయైన శ్రీ శారదాదేవికి ఆలయములు కట్టించిన గ్రామస్థులకు అందు అభిరుచి, అభిమానము కలిగింపజేయుటకు దారికలుగును. దేవాలయ మాముష్మిక సాధనమగును గాని, గ్రంథాలయంబు విజ్ఞానసంపత్తితో గూడుకొని ఐహికాముష్మికసాధనంబు కాగలదు. కాన గ్రంథాలయ వ్యాప్తికి ప్రతిగ్రామము నందును ఒక్క ఆలయమును కట్టించుట ప్రథమకర్తవ్యంబగును.

ఒక్క ఆలయములో మాత్రము స్థిరత్వము ఏర్పడదు. దైవములేని ఆలయము నే గ్రామమున సహింతురు? భక్తాగ్రేసరులవలె దేశాభిమానులు ఆ ఆలయమునకు గ్రంథములను సమకూర్చుటకు ప్రయత్నించవలయును. దేశమున మాతృ దేశాభిమాను లెందరో గలరు. తుదకు ఒక్క గ్రామమునందు ఒక్కరైన యుండరనుట కల్ల. దేశాభిమానులగు ధనవంతుల వలననో, స్థానిక సంస్థల సహాయముననో లేక ప్రభుత్వ సహకారము వల్లనో, విద్యావంతుల కృపవలననో సాధ్యమైనన్ని గ్రంథములను సమకూర్చుటకు ప్రయత్నించవలయును. క్రొత్త గ్రంథరాజంబులను సృష్టించుటకుగాను గ్రంథ మాలికల నేర్పరచి ప్రతి గ్రంథాలయమునందు సభ్యత్వము కల్పించుకొని వీరి చందాల సహాయ్యముచే గ్రంథకర్తలకు చేయూత నొసంగి గ్రంథరచనకు గ్రంథాభివృద్ధికి సహాయ్యపడిన గాని గ్రంథములు అభివృద్ధి గాంచవు.

అయిన గ్రంథాలయము పుస్తకముల గిడ్డంగి కాదు. కావలసినవారికెల్ల గ్రంథము లందుబాటునం దుండునటుల సకల ప్రయత్నములు చేయునదియు, జనసామాన్యము గ్రంథముల యావశ్యకతను గ్రహించి వానిని చదువునటుల చేయునదియు గ్రంథాలయ మని చెప్పనగును. గ్రంథాలయమునకు తమంతట తాము వచ్చువారికి మాత్రమే అది యుపయోగపడుటతో తృప్తిచెందక ఆ గ్రామమునగల జనసమూహమున కంతకును సేవ చేయుటయే సార్వజనిక గ్రంథాలయముయొక్క విధ్యుక్త ధర్మమై యున్నది. గ్రంథాలయమునందున్న ప్రతి గ్రంథమునకు ఒక్క చదువరినైన సంపాదించవలెను. గ్రామమునందుగల ప్రతి మనుజునకును కావలసిన ఒక గ్రంథమునైన సేకరించి పెట్టవలెను. ఈ యుద్దేశ్యమును సమకూర్చుటకుగాను స్వార్థత్యాగముగల దేశాభిమానులచే కూడిన ఒక్క కార్యనిర్వాహక వర్గము నేర్పాటు చేయవలయును.

"గీ. రాష్ట్రమును పాలనముసేయు రాజువోలె
గృహము పాలన మొనరించు గృహిణివోలె
గ్రంథభాండార పాలనాక్రమము నెఱుగు
వాడు భాండారకుడొకండె వసుధయందు."

అని ఒక కవీశ్వరుడు నుడివట్లు గ్రంథాలయంబులు అభివృద్ధిగాంచవలయుననిన జనులను ఆకర్షించవలెనన్న నేర్పరియైన భాండారికుడు మిక్కిలి ఆవశ్యకము. అర్చకునివలె భాండారకునకు మడి మాన్యములు గాని జీత బత్తెములుగాని కల్పించుట యుక్తమని తోచును.

గ్రంథాలయమునందే గ్రంథపఠనము గావించిన నుపయోగముండదు. గ్రంథపఠన గృహములందు పెంపొందించుటకు గృహములకు గ్రంథములను ఎరు వియ్యవలెను. స్త్రీలకు ప్రత్యేకమైన ఏర్పాటులుచేసి వారి యభిమానమును సంపాదించవలయును. గ్రంథాలయ మెల్ల జనులను ఆకర్షించుటకు అనుకూలముగ నుండవలెను. ప్రపంచ పరిస్థితులు తెలియజేయుటకుగాను దిన, వార, మాసపత్రికలను సంపాదించవలెను. గ్రంథాలయములో గ్రంథములలోని వార్తాపత్రికలలోని సారము గ్రహించుటకు ఎల్లరకు సాధ్యముగాకుండవచ్చును. అట్టితరి విద్యాబుద్ధులతో వికాసముగాంచినవారు ఉపన్యాస పూర్వకముగా సంభాషణపూర్వకముగా బోధించుట కవకాశముండవలెను. అట్లు గ్రంథాలయముయొక్క యుపయోగమును గ్రామస్థులు గ్రహించునట్లు ప్రయత్నములు గావించినవానినిచూచి ఇతరగ్రామములందు అటువంటి సంస్థలను నిర్మించి పెంపొందించుటకు ఇతర గ్రామస్థులు పూనుకొనుటకు అవకాశము కలుగును.

గ్రంథాలయములందు వట్టి విద్యాశాఖయేగాక క్రీడాశాఖకూడా ఏర్పాటు చేయుట శ్రేయస్కరము. క్రీడాశాఖ గ్రంథాలయ ముఖ్యోద్దేశములను భంగపరచు నని చెప్పుట సమంజసము గాదు. నవీన పరిస్థితులనుబట్టి క్రీడాశాఖ యుండినగాని సభ్యుల సంఖ్య పెరుగుట కష్టము. ఆదాయమును వృద్ధిగాదు.

మనదేశ ఆర్థిక పరిస్థితులనుబట్టి చూడ గ్రామమునందుండు గ్రంథాలయము ఆ గ్రామస్థుల అభిరుచికి అనువగునెల్ల గ్రంథములను సమకూర్చుట కష్టము. ధనమును వెచ్చించి వలయు గ్రంథములను తెప్పించుటకు ఆర్థిక పరిస్థితులు అనుకూలపడవు. మన దేశములోని, లేక జిల్లాలలోని, తాలూకాలలోని, గ్రామములలోని గ్రంథాలయము లన్నియు నొక్క సంఘముగా నేర్పడి సంచార గ్రంథాలయముల నేర్పరచి వాని మూలకముగ నొక్క గ్రంథాలయములోని పుస్తకములను వేరొక గ్రంథాలయమునకు తీసికొనిపోయి పై కొరతలను తీర్చుట కేర్పాటు గావింపవలయును. ఈ సంచార గ్రంథాలయముల మూలకముగా యుద్ధరంగములోని సైనికులకుగూడా గ్రంథపఠనమునకు అవకాశము కలిగించబడినదని వినుచున్నాము.

ఈ ప్రకారము గ్రామస్థులకు గ్రంథాలయ సౌకర్యముల కలిగించి కొలది చందాలతో ఎక్కువ గ్రంథపఠనమునకు దారిజూపి, తమ పురోవృద్ధికి ఎటుల గ్రంథాలయములు సాధనభూతములో వారు గ్రహించునట్లు చేసిన, అందుపైన వారికి అభిమానము కలిగి తమకు తామే తమ గ్రామములందు పుస్తక భాండాగారములను స్థాపించుటకు ప్రయత్నింతురు.

వీని కంతకు ముఖ్యము ప్రచారము. ప్రచారము లేనిది ఏ వ్యాపారము, ఏ పని సాగదు. ఎటువంటి సంస్థయు వృద్ధి పొందదు. అందుకొఱకు గ్రంథాలయ సంఘముల నేర్పరచి, గ్రంథాలయోద్యమమును నలుదిశల సాగించి గ్రంథాలయములు దేశాభ్యుదయమునకు, భాషా సేవకు, పౌర జీవితమునకు, దేశ స్వాతంత్ర్యము నొంద లగు ప్రజౌన్నత్యమునకు ఎటుల సహాయ్యపడునో ప్రచారమూలకముగాను ఇటువంటి వార్షికోత్సవముల మూలకముగాను వెల్లడిచేసిన ప్రజలకు వాని పైన అభిమానము అభిరుచి కలిగి గ్రంథాలయ వ్యాప్తికి చక్కని అనుకూలములు సిద్ధించునని నమ్ముచున్నాను.

# గ్రామ ప్రజలు - గ్రంథాలయములు

రావుసాహెబ్ గోటేటి జోగిరాజుగారు
స్వయంపోషకకృష్యాశ్రమము - కొండెవరం

ఆంధ్రదేశమున కంతటికిని సుమారు 800 గ్రంథాలయములు మాత్రమే గలవని గ్రంథాలయ సభవారి పట్టిక తెలుపుచున్నది. ఇందు నిజాం రాష్ట్రమునను, ఆంధ్రేతర ప్రదేశములందలి యాంధ్రుల చేతను నెల కొల్పబడిన గ్రంథాలయములు గూడ చేరియున్నవి. చెన్నపురి రాజ ధానిలో జేరిన తెలుగు జిల్లాలలో గల దాదాపు 20,000 ల గ్రామ ములలోను సుమారు 700 గ్రామములందు మాత్రమే గ్రంథాలయ ములు గలవు.

గ్రంథాలయముల సంఖ్యను, ఉపయోగంబగు నభివృద్ధి చేయ వలసిన యగత్యతను గూర్చియు నందుకుగల లేక గలుగజేయబడ వలసిన సాధన సంపత్తును గురించియు నిదివరలో జరిగిన గ్రంథాలయ సభలలో నీ యుద్యమాభిమానులు పలువురు సూచించియేయున్నారు. వారి సూచనలు చాలవరకు గ్రంథాలయసభా నివేదికలలో గూడ ముద్రింపబడియే యున్నవి. అంతకంటె నేను తెలుపదగిన క్రొత్తవిషయములంతగా గానరావు.

వీలగునన్ని గ్రామములలో గ్రంథాలయములను నెలకొల్పు టయేగాక యవి గ్రామప్రజలకు తగినంత ప్రయోజనకరములుగ నుండునటుల జేయుటకుగూడ గ్రంథాలయోద్యమ వ్యాపకులు శ్రద్ధ వహింపవలసియుండును. గ్రంథాలయముల యుపయుక్తత పాఠకుల సంఖ్యనుబట్టియేగాక, వారలకవి గలుగజేయు నీక్రింద వివరింపబడు మూడువిధములగు మేలునుబట్టికూడ నుండును.

1. పాఠకుల మనసును రంజిల్లజేయుట. గ్రామస్థులు పని పాటలుచేసి విశ్రాంతిగానున్నపుడు వార్తాపత్రికలు, కథలపుస్తక ములు, నవలలు, ఇతిహాసములు మొదలగునవి చదువుచో గొంత చిత్త విశ్రామము, శాంతియు, సంతోషమును గలిగి సేదదీరును. భాషయం

దభిరుచిగల చదువరులకు చదువువిషయములే గ్రంథమునందలి భాషా చాతుర్యమును, భావసౌందర్యమునుగూడ నాహ్లాదమొనగూర్చును. తొలుత పాఠకుల నాకర్షించుట కిట్టి వాఙ్మయమే యెక్కువగ దోడ్పడును. గ్రంథాలయ నిర్వాహకులిట్టి వాఙ్మయమును సేకరించుటలో నశ్లీలతను, నైచ్యభావమును పెంపొందించు పత్రికలు నవలలు మొదలగువానిని పరిశీలించి త్యజింపవలెను.

2. పాఠకులు తమ యార్థిక ఆరోగ్యాదికములం దభివృద్ధి కలిగించుకొనుటకు దోడ్పడుట. గ్రామస్థులు తమ తమ జీవనవృత్తులకు సంబంధించిన యా యా పనులందు నిపుణతను హెచ్చించుకొని యందువలన తమ యార్థికస్థితి నభివృద్ధిచేసికొనుటకును వారల యాహార విహారములను క్రమపరచుకొనుటకును వలయు జ్ఞానము నొసగు సాంకేతిక గ్రంథములను, శాస్త్రగ్రంథములును ఈవిధమగు మేలునొనగూర్చును. ఇట్టి గ్రంథము లాంధ్రమున కొలదిగనే యున్నవి. లభించినంతవరకు గ్రంథాలయ నిర్వాహకులు వీనిని సేకరించి వానివలన పాఠకులు తమంత లాభమును బొందుటకు కొంత ప్రత్యేక కృషిచేయుట యావశ్యకము. నిర్వాహక వర్గమున నొకరైనను, నీ విషయమున ప్రత్యేక సామర్థ్యతను గలిగియుండవలెను. ఆర్థికాభివృద్ధియు, ఆరోగ్యాభివృద్ధియు దేశాభ్యుదయమునకు బునాదులు.

3. ఆత్మ వికాసమునకును ఉన్నతికిని తోడ్పడుట. కేవల ఆర్థిక ఆరోగ్య సంపత్తిమీదనే సంఘౌన్నత్య మాధారపడియుండదు. ఇప్పటి పాశ్చాత్య నాగరకత యీ రెంటిమీద మాత్రమే కేంద్రీకరించుటయే ప్రస్తుత ప్రపంచ కల్లోలమునకు ముఖ్యకారణము. కావున గ్రామప్రజల మనసులందలి సంకుచితమగు వ్యక్తి సౌభాగ్య ప్రాధాన్యతను తగ్గించి, సంఘౌన్నత్యమునకు వలయు విశాల దృష్టిని గలిగించు చారిత్రక, సాంఘిక, నైతిక, ఆధ్యాత్మిక గ్రంథములనుగూడ గొన్నిటిని సేకరించి వాని పఠనమును, నందలి బోధలను నిత్యజీవిత

మున ననుసరించుటయు ప్రోత్సహింపదగును. గ్రామాభివృద్ధికైననేమి దేశాభ్యుదయమునకైననేమి ప్రపంచశాంతికైననేమి మానవస్వభావమునందు విశాలదృష్టియు, ఆత్మజ్ఞానమును గలుగుటయే ప్రధానము. వీనిని గలిగించుటయే గ్రంథాలయోద్యమ పరమావధిగనెంచదగును.

పైని సూచింపబడిన త్రివిధ ప్రయోజనములకును దగిన గ్రంథములు, పత్రికలు వగైరాల పట్టికలను తయారుచేయించి గ్రంథాలయనిర్వాహకులకందజేయుట కాంధ్రగ్రంథాలయ సంఘమువారు పూనుకొనదగును. చిన్న, నడిమి, పెద్ద గ్రంథాలయములు వానికి లభించుమూలధనమునుబట్టియు, సాంవత్సరికపు రాబడినిబట్టియు, మొదటనేగాని పిమ్మట నేటేట కొంతగాని, వెచ్చింపదగు కొద్ది అనగా రెండువందలు, మధ్యను అనగా ఐదువందలు, పెద్ద అనగా వేయిరూపాయల మొత్తములను పెట్టికొనదగు గ్రంథాదికముల పట్టికలను వేర్వేరుగ దయారుచేయుట మంచిది.

గ్రంథాలయ నిర్వాహకులు కేవలము పుస్తకములను, పత్రికలను సేకరించి పాఠకులకు లభ్యము చేయుటయే గాక పై త్రివిధ ప్రయోజనములను సాధించుటకు దోడ్పడు కొన్ని యితర సాధనములను గూడ నవలంబింపదగును. వీనిలో నీ క్రిందివి ముఖ్యములు:—

1. ఉల్లాసజనకమగు నాటపాటలు, పాటకచ్చేరీలు, వ్యాయామములు, వానిలో పోటీలు, సన్మానములు మొదలగువాని కేర్పాట్లు గావించుట.

2. తజ్ఞులచే నుపన్యాసము లిప్పించుట, బొమ్మల లాంతరు ప్రదర్శనములు, సామాన్య చిత్రప్రదర్శనములు మొదలగునవి జరుపుట. ఇట్టివి చదువు వచ్చినవారికేగాక యితరులకుగూడ జ్ఞానము గలుగ జేయును.

3. వ్యవసాయక, పారిశ్రామిక ప్రదర్శనములు, పోటీలు, సన్మానములు ఏర్పాటుచేయుట.

4. పురాణ కాలక్షేపములు, భజనలు, ఉత్సవములు, గ్రామ నాటకములు ఏర్పాటుచేయుట.

ఇట్టి పనులలో యీ గ్రామములందు గల యంగబలమును బట్టియు ఆర్థిక బలమును బట్టియు యథాశక్తి బూనుకొనదగును.

---

## పసిబిడ్డలు, గ్రంథాలయములు

శ్రీ మలుగూరు టి. గురుమూర్తిగారు

హిందూపురము

విశ్వగురుండగు సర్వేశ్వరు నారాధించుట కతని భువన వనవాటికయందు, పలుతావుల వెదజల్లు వివిధ కుసుమ గుచ్ఛములు పసిబిడ్డలు. ఈ బిడ్డలతో కలసి కూర్చుండి, యాడి, పాడి, నిరంతరము వారి మధ్యజీవితము గడపుచు, వారిని కనిపెట్టి వారి సర్వతోముఖాభివృద్ధికి పాటుపడుచుండు వారి జీవితములు ధన్యములు. విశ్వేశ్వరుని వివిధ మహాశక్తుల స్వరూప ప్రతిబింబములైన యమూల్యకులగు ఈ పసిబిడ్డల సేవ పరమాత్మునిసేవ. మొగ్గయందలి పుష్పపత్రమువలె ఈ బిడ్డలయందు జన్మతోగూడ గలసి వచ్చుచుండు పలువిధశక్తులయొక్క ప్రాణ బీజములకు నీళ్లుపోసి, యెరువువేసి, మొలక లెత్తించి, పెంచి, పెద్దవానిగ నొనర్చి, పుష్పించి ఫలించునట్లు చేయుట విజ్ఞానసేవకుల మొదటి ధర్మము. ఇట్టి ధర్మము నెఱపుటలో గ్రంథాలయములకుంగూడ తమవంతు లేకపోలేదు.

ఒకదేశముయొక్క భావిభాగ్యోదయ పరిణామము ఆదేశముయొక్క బిడ్డల భావిజీవితవికాసముపై నాధారపడియుండును. ఇట్టి భావిజీవితవికాసమునకు ఆదేశముయొక్క విజ్ఞానము మూలము. విజ్ఞానమయ స్వరూపుడు దేవుడు. అందుచే విశ్వవ్యాప్తంబైన ఈ విజ్ఞానము సర్వులకు జన్మహక్కగుచున్నది. మానవుని శరీరమునందలి యన్నకోశములకుతోడు పుట్టుకతోడనే విజ్ఞానమయకోశముగూడ నేర్పడుచున్నది. పసిబిడ్డలయొక్క యంగసౌష్ఠవమునకు సుస్వరూపమునకు ఆరోగ్య సౌభాగ్యమునకు గాను తలిదండ్రులెంతటి శ్రద్ధవహింపవలసియున్నదో అంతకంటె వేయిమడుగులెక్కువగ వారి మానసికాంగ సౌష్ఠవమునకు మానసిక సుస్వరూపమునకు మానసికారోగ్య సౌభాగ్యమునకు శ్రద్ధ వహింపవలసి యున్నది. ఈ పని, యొక్క తలిదండ్రులతో నాగదు. ఇంట నున్నప్పుడు వారు, బడియందు గురువులు, బాహ్యప్రపంచమున బడి నపుడు విజ్ఞానులగు పెద్దలుగూడ ఈ బిడ్డల సక్రమ సత్వరాభివృద్ధుల కాధారులై, వారినికంటికి రెప్పవలె గాచి సంరక్షించుట వారి విధ్యుక్త ధర్మమగుచున్నది.

పూర్వమున నిలువిడిచి బడికి బయలుదేరులోపలనే, కంఠస్థమగు గొప్ప జ్ఞాన సముదాయముతో, బాలుడు బడిని జేరుచుండెను. ఇంతేగాదు, తన వృత్తి జ్ఞానము గూడ కొంచెముగనో, గొప్పగనో, యతడలవడజేసికొని యుండెను. అమరము, ఎక్కములు, ముప్పాతికలు, కథలు, పద్యములు మొదలగువాని నంతయు చాల భాగము తండ్రి పిల్లవాని కింటియందే, నోటికి నేర్పి వాని జ్ఞాపకశక్తి కొక విధమగు నుత్తేజమును గలిగించుచుండెను. బడికి చేరిన యనంతరము వ్రాయుట, చదువుటాదిగాగల తక్కిన వ్యవహార జ్ఞానమంతయును, బడియందుపాధ్యాయుడు నేర్పుచుండెను. తిండికిని బట్టకును పుష్కలముగ నుండిన మనవారా నాడింతకంటె నెక్కువ విద్య కాశించలేదు. ఒకవేళ నున్నతవిద్యకొరకాశించెడివారున్న అట్టి విద్యాలయములను, గురుకులాశ్రమములను, తమ యభిరుచుల ననుసరించి వెదకికొని పోవుచుండిరి.

ఈనాడు బాలురు శుష్కహృదయములతో బడికేతెంచునట్టి దౌర్భాగ్యస్థితి యేర్పడియున్నదనిన మన్నింపుడు. తలిదండ్రులమగు మనకే విద్యావాసన సున్న. అల్పమో స్వల్పమో యున్నను దివారాత్రములు పొట్టకు బట్టకు కొట్టుకొనుటకే మనకున్న కాలమంతయు సరిపోవుచుండ నిక మన పిల్లలబాగోగులు విచారించుటకు కాలము, ఓర్పు, మన స్థిమితము చాల తక్కువ. తక్కువేమి? లేనేలేదనవచ్చును. అందుచే మన మెల్లరము మన బాలుర నెవరో యొక యుపాధ్యాయున కొప్పగించి వారు విద్యావంతులై బాగుపడుచున్నారని తృప్తిపడుచున్నాము. తుదకు బాలురు ఇంటికేతెంచినప్పుడైనను వారి విద్యావ్యాప్తిని దగ్గఱకూర్చొనబెట్టుకొని విచారించునంతటి పాపమునకైనను బోము. అంతేకాదు బిడ్డలు తమకు తామై ఏదైనను చదివెదమన్నను వ్రాసి చూపించెదమన్నను విసుగుకొందుము. ఇక బడియందుపాధ్యాయుడు అస్వతంత్రుడై ఒక కట్టుబాటుకు, ఒక ప్రణాళికకు, ఒక నియమితకాలమునకు పొట్టకూటికై వచ్చు మాస స్వల్పవేతనమునకు లోనై ప్రవర్తింపవలసినవాడై దినమున కొక్కింత కాలముమాత్రమే బాలుర విద్యాభివృద్ధివిషయమై గమనించుచుండును. ఇన్ని భౌతిక మానసికారికాది సుడిగుండములలోబడి యూపిరాడక తికమక పడవలసిన దుర్భర విషాదదుస్థితికి మనము పాత్రులము గావలసిన నోము నోచియుండుట చేతనే ఒకవంక తలిదండ్రులు, మరొకవంక ఉపాధ్యాయులు, వీరికి తోడు తక్కిన విజ్ఞానసంపన్నులు దేశమునంగల విజ్ఞాన వికాసమున కెక్కువ తోడ్పడకపోవుటయు, ఎంతటి సుస్థిర సువిశాల విద్యావిధానము కలిగియున్నను, ఎన్ని విద్యాలయములు దేశమునందు నెలకొల్పబడియున్నను, అందఱిని కలిపిన మనవారిలో నూటికి ఏపదిమందిరో చదువుకొన్నవారైయుండుట లెక్కకుచిక్కుట తటస్థించి మనదేశమున నిరక్షరాస్యతను రూపుమాప వలనుగాకున్నది. ఈ దుస్థితిని బాపుట గ్రంథాలయముల మొదటిపని.

విజ్ఞాన సంపాదన పుట్టుకతో ప్రారంభమై జీవితాంతమువరకును, మానవుని వెంట నిరంతరమ్ము, నిరాటంకముగ నడచుచుండ నేవలయును. పిల్లల భావిజీవితమే యే

నడకల, నే రే దశల ననుసరించి నడచుచున్నదో, గ్రంథాలయములుకూడ నా యా నడకలకు దశలకు ననుగుణ్యముగ, విజ్ఞానమును వీరి యందుబాటులోనికి తేవలసియుండును. జీవితమునకు పునాది వేయబడవలసియుండు బాల్యదశయందు విజ్ఞాన వ్యాపకమునకు ఆంధ్రావనియందింకను గ్రంథాలయము లతి బాల్యదశయందే యున్నవనిన మన్నింపుడు.

బాల్యమునందు బిడ్డలకు అనుకరణ శక్తియు, వస్తుపరిశీలనాసక్తియు నెక్కువ. వారొక్కొక్కప్పు డకస్మాత్తుగ నడుగు ప్రశ్నలకు మనము జవాబు చెప్పలేకయుందుము. వారికి వివిధ శబ్దగ్రహణమునందనురక్తి మెండు. పసితనమున వారి యింద్రియములకు సునిశితమైన శక్తి యధికము. ఈ యింద్రియముల శక్తి నినుమడింపజేసి, వారి దృష్టి నాకర్షించువిధమున, వారి వీనులకు విందు నొనర్చెడి రీతి, వారి పరిశీలనా శక్తి యధికమగునట్లు వారి యనుకరణము వ్యాప్తి బొందునట్లు చేయగల వివిధవస్తు సమూహముతో గూడి, వారి నాకర్షించి, బాల విజ్ఞానమును వెదజల్లుటకుగాను సర్వాంగ సుందరములగు ప్రత్యేక గ్రంథాలయములు బయలుదేఱవలయును. ఇట్టి గ్రంథాలయములు, చిత్ర విచిత్ర వర్ణములతో గూడిన పటములతో నిండియుండవలయును. ఇందు మన పురాణేతిహాసములయందు నీతిదాయకములగు కథలయొక్క వివిధ ఘట్టములు ఆకర్షవంతముగ చిత్రింపబడి యుండవలయును. బాలురుగాన ప్రియులుగాన, వీరి గ్రంథాలయములు సంగీత నిలయములు గావలయును. వస్తు పరిశీలనా ప్రియులగు వీరి గ్రంథాలయము, అనేక విషయములను బోధించు పలువిధ వింతవస్తువులతోను ఆటబొమ్మలతోను నిండియుండవలయును. వీరి పుస్తకములు అందముగను, విషయముల నెఱుకపఱచు మంచిరంగుల పటములతోడను, పెద్ద యక్షరములతోను గూడుకొనియుండవలెను. అందలి సారస్వతము ఒకేవిధమగు గతికి ప్రాసకులోనై వారికి చదువుటకు మధురముగను నింపుగను నుండవలయును. వారి గ్రంథాలయమందు బాలుర నాకర్షించు పూజలు, నుత్సవములు, నాటక ప్రదర్శనములు, వైజ్ఞానిక పోటీపందెములు, బహుమతులు మొదలగునవి తఱచుగ జరుగుచుండవలయును. అట్టి గ్రంథాలయాధికారులు వట్టి గ్రంథాలయాధికారులుగానుండక ప్రేమపూరితహృదయములతో తలిదండ్రులవలె బిడ్డల నాకర్షించు చిత్తవృత్తిగలవారుగ నుండవలయును. పిల్లలయభిరుచుల గుర్తించి వారివారి రుచులకు దగినట్లు పటములు, బొమ్మలు, కథలపుస్తకములు అవి యివి యననేల? వారు కోరిన సకల పరికరముల నందుబాటులో నుండునట్లు పిల్లలకొఱకు ప్రత్యేక గ్రంథాలయము లేర్పడవలయును.

విశ్వవ్యాప్తంబైన విజ్ఞానవికాసమునకు ఆంధ్రదేశ గ్రంథాలయోద్యమము సర్వతోముఖముగ బనిచేయ నడుముగట్టియుండుట నిశ్చయము. అనంతములైన విజ్ఞానవాహినుల కాకరంబగు విశ్వవిజ్ఞానమహార్ణవమును మథించి యందుత్పన్నంబగు విజ్ఞానామృతంబును గ్రంథాలయ స్వర్ణపాత్రములం బోసి రసగ్రహణ రుచి స్వభావులగు పసిబిడ్డ

లకు బంచిపెట్టుట గ్రంథాలయోద్యమముయొక్క ముఖ్యధర్మము. మానవకల్యాణమునకు తద్వారా లోకకల్యాణమునకును మూలాధారమగు విజ్ఞాన సర్వస్వము గ్రంథస్థమై యుండుటచే, నట్టి గ్రంథరాజముల నాకర్షవంతములుగఁ జేసి, బాలుర యందుబాటులో నుంచవలయును. దేశ కాల పాత్రాతీతమై, విశ్వశ్రేయమునకు సాధకముగా నున్న పరమోత్కృష్ట విజ్ఞానమునకు బాలవిజ్ఞానము పునాది. ఇట్టి బాలవిజ్ఞానము పసిబిడ్డల చేతులలో బెట్టు కార్యమునకు పవిత్ర సదుపాయముల నెక్కువగా కల్పించి మానవాభ్యుదయమునకు దోడ్పడు సర్వశక్తుల ఆంధ్రదేశ గ్రంథాలయోద్యమమునకు విజ్ఞానమూర్తియగు సర్వేశ్వరుడు ప్రసాదించుగాక యని ప్రార్థించుచున్నాను.

---

## గ్రంథాలయము - విద్యాలయము

శ్రీ పాతూరి నాగభూషణంగారు, డి. యల్. యస్.
ఆంధ్రదేశ గ్రంథాలయసంఘ కార్యదర్శి

"గ్రంథాలయము బడి విడిచిన యనంతరపు పాఠశాల. ఇది పాఠశాల విద్యలో నుండు లోపములఁ బూర్తిచేయుటయే గాక జీవయాత్ర కనువగు విద్య నిచ్చి జ్ఞానమును బూర్తి చేయును."

ప్రపంచమున నిప్పుడమలునందున్న విద్యా ప్రచారసాధనములలో నెక్కువ వ్యాప్తిగాంచినవి విద్యాలయములు, గ్రంథాలయములునై యున్నవి. విజ్ఞానవ్యాప్తికి తోడ్పడు రేడియో, సినిమా, ఉపన్యాసాది ఆధునిక విధానములును, నాటకము, పురాణ కథా కాలక్షేపము లాది గాఁగల పురాతన సాధనములును, ప్రపంచమున విరివిగ ప్రచారము నందున్నను గ్రంథాలయ విద్యాలయములవలె నివి నిశ్చితమైన ప్రణాళికల ననుసరించి నడుపఁబడుటలేదు. మరియు వీనిలోఁ జాలభాగము గ్రంథాలయ విద్యాలయముల పక్షమున నేడనేక తావుల నిర్వహింపబడుట మనము చూడఁగలము.

ఇతరదేశములందువలెనే మన భూమియందును వ్రాత తెలియని కాలమొకటియుండినది. ఇచ్చట లిపి వ్యాప్తిలో లేనికాలమున విజ్ఞానము గురుశిష్యపరంపరగఁ గంఠస్థము చేయఁబడి మనోఫలకములపై

వ్రాయఁబడుచుండెడిది. అద్భుత మేధాశక్తి సంపన్నులగు నాటి విద్యార్థులు తమ గురువులముఖతః వినిన యనేకవిషయములఁ బొల్లు వోకుండ జ్ఞప్తియందుంచుకొనువారు. మఱియు శాస్త్రములన్నియు నా దినములలో చిన్ని చిన్ని సూత్రములలో నిముడ్చఁబడి జ్ఞప్తియం దుంచుకొనుటకు సుకరముగనుండెడివి. ఇప్పటిగ్రంథములలో కొన్ని పేజీలు నిండు విషయమును కొలఁది వాక్యములలో నిముడ నేర్పాటుచేసినవే నాటిసూత్రములు.

కాలముమారి వ్రాత యములునకు వచ్చిన తదుపరి వ్రాయుట చదువుట విద్యాభ్యాసమున కవసరములయ్యెను. దీనితో వ్రాత చదువుల కవసరములైన పరికరములును నెమ్మదిగ నములులోనికి వచ్చెను. కొయ్యపలకలు, పిమ్మట రాతి రేకుపలకలు, ప్రస్తుతము కాగితములు వ్రాతకును—ముంగు రాగి శిలాశాసనములు, అనంతరము భూర్జర తాళపత్రములు, ప్రస్తుతము కాగితములు, తరతరములవారు చదువుకొనుటకై వినియోగపడు గ్రంథనిర్మాణమునకును వరుసగా వాడఁబడుచు వచ్చినవి. వేలకొలఁది ప్రతుల నత్యల్పకాలములోఁ దయారుచేయఁగల యచ్చువిధాన మాచరణకువచ్చుటతోఁ బూర్వము వలె నన్నివిషయముల జ్ఞప్తియుంచుకొనవలసిన యవసరముతొలఁగి నది. దీనితో నిప్పటి విద్యార్థులందు అలవాటులేకనో మఱెందువల ననో ధారణాశక్తియు సన్నగిల్లినది.

విద్యాబుద్ధులు లేతవయస్సులోనే యలవడవలయును. అందు వలననే చిన్నతనములోనున్న బాల బాలికల కొఱకు విద్యాలయములు లేర్పడి చదువునేర్పుటకై కృషిచేయుచున్నవి. స్వతంత్రదేశములలో ముఖ్యముగఁ బ్రజాస్వామిక ప్రభుత్వవిధానము పూర్ణముగ నములు చేయు రష్యాలోఁ దక్కిన విషయములతోఁబాటు విద్యాసముపార్జనా సంబంధముగఁగూడఁ బ్రజలందఱికీ సమానావకాశములు నిర్బంధో చిత ప్రాథమిక విద్యావిధాన మములునందున్నను మనకట్టియదృష్ట మెప్పటికి లభించునో చెప్పఁజాలము. బానిసత్వము వదలినగాని యందఱికిఁ జదువుచెప్పించుకొనఁగల శక్తి మనకబ్బునట్లు కనఁబడదు.

ప్రస్తుతము వెనుకఁబడియున్న ప్రాంతములలో నెట్లున్నను కొంచెము నాగరికతగల ప్రదేశములలో ప్రభుత్వము వారి పరిశీలనక్రిందగాని, స్థానికసంస్థల యాజమాన్యమునగాని, ఉదారులగు విద్యాభిమానుల ప్రయత్నము వలనఁగాని పాఠశాలలేర్పడి ఉచితముగనో, డబ్బుపుచ్చుకొనియో విద్యాబోధనను గావించుచున్నవి. అయినను బడివదలుటతో నీ చదువులను విద్యార్థులు మరచుటయు, ఆర్థిక కారణముల మూలముననను, సమయము కుదురనందుననను కొంతమంది-ముఖ్యముగ బీదలు వీనియందుచేరి చదువఁజాలకపోవుటయుఁ దటస్థించుచున్నది.

పైఁజెప్పిన కారణములవలనఁ గలుగు లోపములఁ దీర్చి కొంతవరకు చదువను వ్రాయను నేర్చినవారు బడిమానినపిమ్మట దానిని మరచిపోకుండ నభివృద్ధిజేసికొనుటకును, బ్రతుకుదెరువుకై వృత్తులలోను ఉద్యోగములందును ప్రవేశించువారికి తీరికసమయముల కాలక్షేపమునకును, తమతమ పనులయందు మధ్యమధ్య గలుగు చిక్కులఁ బరిష్కరించుకొని ప్రవీణులగుటకును, ప్రపంచమున నిరంతరము సంభవించు రాజకీయార్థిక సాంఘికాది సమస్తపరివర్తనలను గూర్చి యెప్పటికప్పుడు తెలిసికొనుటకును వీలుగ గ్రంథాలయములేర్పడి, ఆబాలగోపాలమునకు అన్నివృత్తులవారికి నార్థికభేదములుగాని జాతి మతభేదములుగాని లేకుండ నుచితముగ జ్ఞానదానమును జేయుచున్నవి. నేటి గ్రంథాలయము వయోజనవిద్యకు పాఠశాలానంతర విద్యకు మూలముగ నుండి సర్వమానవకోటికి నుచితముగ చదువునేర్పు సర్వకళాశాలగ పరిణమించినది.

ఇట్లు గ్రంథాలయమున బాఠశాలలోవలెనే విద్యా ప్రచారము జరుగుటయేగాక దీని కార్యక్రమము పాఠశాలపనిని మించి ప్రయోజనకారి యగుచున్న సంగతిని పైని తెలిపియుంటిని. బడికి నిర్ణీతకాలమున నిత్యము వచ్చి యచ్చటి విధి నిషేధములకు సంపూర్ణముగఁ గట్టుబడి యుపాధ్యాయుల యధికారమునకు లోఁబడి నడచుకొను సంపన్నుల బిడ్డలకుమాత్రము నేటి పాఠశాల లుపకరించుచున్నవి. మన దిప్పుడు బానిసలముగ నున్న కారణమున మన పాఠశాలలందలి

విద్యావిధానమును విదేశీయులగు మన ప్రభువుల యిచ్ఛ ననుసరించి యేర్పడినదగుటచే స్వీయాభివృద్ధి కేమాత్రమును దోహదము నిచ్చునదిగ లేదు. మఱియు మన పాఠశాలలందలి పరీక్షలు పనికిమాలిన విషయముల బలవంతముగ చదువునట్లు ప్రోత్సహించుచు విద్యార్థుల మనశ్శరీరముల పాడుగావించుచున్న వేకాని చక్కటి విజ్ఞానమును చేజిక్కించుకొనుట కివి సహాయపడుట లేదు.

ఇంక బ్రతుకలేక బడిపంతుల యుద్యోగమునకు దొరకొను నేటి మన పాఠశాలోపాధ్యాయు లొకవంక ప్రభుత్వమునకుఁ వేఱొకవంక నిత్యము తమపై నధికారము చలాయించు విద్యాశాఖోద్యోగులకు, మఱొకవంక స్థానిక సంస్థల సభ్యులకు, వారి మిత్రులకు, పాఠశాలల యజమానులకు భయపడుచు తమ ధర్మమును జక్కగ నిర్వర్తింపఁజాలని దుస్థితియందున్నారు. స్వబుద్ధితో తమ పనిని వీరు స్వేచ్ఛగ నెరవేర్చుటకు ప్రతిబంధకములు మెండుగ నున్నవి. ఇట్టి పరిస్థితులలోఁ దయారగు మన విద్యార్థులకు సత్సంప్రదాయములు పట్టుబడు టెట్లు ? వీరు భావి పౌరులగుతరి జీవితసమస్యల వివేచనతోఁ బరిష్కరించుకొనఁ గలుగు టెట్లు ?

ఈ చిక్కులను సులభముగ పరిష్కరింపఁ దగిన సంస్థ గ్రంథాలయమే. కారణము పాఠశాలలందుగల నిర్బంధము లిందు లేకుండుట యొకటి. పాఠశాలలందలి విద్యార్థులవలెఁగాక గ్రంథాలయమందలి పాఠకులు తమకు కావలసిన పొత్తముల నింటికి తెచ్చుకొని చదువుకోవచ్చును. పాఠశాలలోవలెఁ బాఠ్యక్రమము, పరీక్షల బాధ లేకపోవుటయేగాక చదువరులు తమ యిచ్ఛ ననుసరించి విషయముల తమకు వలసినంతవరకు తెలిసికొనుటకు గ్రంథ భాండాగారము లన్ని సౌకర్యముల గలిగించ సమర్థములై యున్నవి మఱియు పాఠశాలలో నిర్ణీత విషయములే, కొలఁదిగ నున్న యావియు పక్షపాత దృష్టిలోనే పఠించవలసిన స్థితి గలుగుచుండ గ్రంథాలయములలో గావలసిన నే విషయమునుగూర్చి గాని యన్ని దృక్పథములతోను జర్చింపబడిన యనేకులగు పండితుల వ్రాతలు సవిమర్శకముగ జదువు

కొనుట కవకాశములు లభించుచున్నవి. బలవంతముగ నెత్తిపై రుద్ది స్వంత యాలోచన కెడమీయని బోధనా విధానము పాఠశాలలయందములు జరుగుచుండ స్వేచ్ఛతో పువ్వు పువ్వుపై వ్రాలి యందలి మధువును గ్రహించు తేనెటీగ విధముగ స్వయం సహాయముతో విద్యనార్జించు పద్ధతి గ్రంథాలయముల నడచుచుండును. మఱియు గ్రంథాలయములు తమ కడకు రానివారిని సహితము స్వయముగ దర్శించి వారికి వలయు విజ్ఞాన సామగ్రిని పంచిపెట్టుచు, ఉపేక్షావంతుల కపేక్షను గలిగించు తమ నిత్య నూతన విధానముల ద్వారా యత్యంత ప్రచారములోనికి వచ్చి, బడులలో చదువు బాలురతో బాటన్ని వర్గముల వారికిని నందుబాటులో నున్నవి.

ఇఁక గ్రంథాలయములు పిన్నవయస్కులకు ముఖ్యముగ విద్యార్థుల కెట్లుపకరించునో విచారింతము. ఇతర దేశములలో ఆధునిక గ్రంథాలయము లన్నింటను నేఁడు బాలశాఖలు విరివిగ వెలసి పని చేయుచున్నవి. చదువుకొనుటకు పుస్తకములే గాక శారీరక మానసిక వికాసము గలిగించు క్రీడా వినోదములును వారి నిమిత్త మిందేర్పాటు చేయఁబడుచున్నవి. ప్రత్యేక శిక్షణం బొందిన భాండాగారుల యధీనమున నడచు నీ బిడ్డల గ్రంథాలయములలో వారి నాకర్షించు పద్ధతులు దినదినము మార్పు గాంచుచున్నవి. చక్కని చిత్రములతో నలంకరింపబడిన యందమైన మందిరములు, నందు సొగసుగఁ దక్కువ యెత్తులో చుట్టు నచ్చటచ్చట నుంచఁబడిన యరలలో నమర్పఁబడిన పుస్తకములు, వీనిమధ్య నచ్చటికి వచ్చు పసివారికిఁ దల్లులవలెఁ దోడుపడుటకు సిద్ధముగనుండు నగుమోము సుందరులతో వివిధ దేశములందలి పిన్నలకు నచ్చటి గ్రంథాలయములు నిత్యము దర్శన స్థానము లగుచున్నవి. వివిధములగు చిత్రపటములతో, రంగు రంగుల పుటలతో, అందముగు పై యట్టలతో నలరారుటయేగాక అచ్చటి గ్రంథములు పిన్నవయస్కులలో నన్ని యంతరువుల వారికి తగియనేక విషయములపై వ్రాయబడి యుండుటయు, అప్పుడప్పుడు వారికి కథాప్రసంగములు, మ్యాజికులాంతరు నాటకాది ప్రదర్శనముల

యేర్పాటు చాల దేశములందలి పిల్లల గ్రంథాలయములలో నాచార ముగ నున్నది. ఈ పరిస్థితులు మన కిప్పుడు పూజ్యములు. త్వరలో సంభవించు సూచనలును కానరావు.

అయినను వీనిలో కొన్నింటిని మన మవలంబించ వచ్చును. ప్రభుత్వ సాయ మున్నచో పై పను లన్నియు మనకు సుసాధ్యము లగును. ఇంక ప్రస్తుతమున్న పరిస్థితులలో మన గ్రంథాలయముల విద్యార్థు లెట్లుపయోగించుకొనఁ దగునో తెలుపఁ బ్రయత్నింతును. వీనిని విద్యార్థు లేల యుపయోగించుకొన వలెనో ముందు చెప్పెదను. నేటి పాఠశాలల బోధనా విధానముయొక్క బాధనుండి కొంతకాల మైన విముక్తి బొందుటకును, అచ్చట నేర్చు విషయముల యథార్థ తను పరికించి అందలి లోపముల సవరించుకొనుటకును, అందు బొత్తుగఁ జెప్పని అవసర విషయములను, భారతదేశ భవితవ్యతను నిర్ణయించఁదగు ప్రపంచ పరివర్తనములను దెలిసికొని చేతనైనంత వరకు దేశ సేవయందుఁ దమ విధిని నిర్ణయించుకొనఁ గలుగుటకును విద్యార్థులు తప్పక గ్రంథాలయ సంస్థల సాయమును బడయు టవస రము. పిన్నల వికాసమునకు బాల్యమున క్రీడలాదిగాఁగల వినోదము లెట్లవసరమో తాము పెద్దవారై పౌరధర్మముల గుర్తెరిగి ప్రవర్తించు కొనుటకు దగిన శిక్షణమును ముఖ్యముగ నుండవలెను. దీనికి పత్రికా పఠనము, సద్గ్రంథ కాలక్షేపము, వివిధ విషయములపై యనుభవజ్ఞుల యుపన్యాసములు, వాగ్వర్ధనీ సభలు, పాఠక సంఘ ములు (Study Circles), యాత్రలు చాలఁగ తోడ్పడగలవు. ఈ సాధనము లన్నింటికి గ్రంథాలయములు ప్రత్యక్షముగను పరోక్షము గను సాయపడుచుండును. పుస్తక ప్రచారముతో బాటు గ్రంథాల యము లొనర్చు నీ కృషిని గ్రంథాలయవ్యాప్తి యని పిలతురు.

ఈ సందర్భమున చెప్పవలసిన విషయము మరొకటి గలదు. గ్రంథాలయ భూమియని పేరుగాంచిన అమెరికాఖండ మందును, గ్రంథాలయోద్యమము బాగుగ వ్యాప్తి గాంచిన తదితర దేశముల లోను విద్యాలయములకు గ్రంథాలయములకు మధ్య నుండఁదగు సంబంధమునుగూర్చి చక్కని శ్రద్ధ గైకొనఁబడుచున్నది. పలుతావుల

పాఠశాలల నిర్వాహకుల యాధ్వర్యమున నడుపఁబడు ప్రత్యేక పాఠశాలా గ్రంథాలయముల విషయ మటుంచి వివిధ దేశములందలి గ్రంథాలయములు తమ సేవను సమీప పాఠశాలలకు ప్రత్యక్షముగ నందజేయుట మనము వినుచున్నాము. అప్పుడప్పుడు బడులలోని యొక్కొక్క తరగతి విద్యార్థులు గ్రంథాలయములకు పిలుచుకొని పోబడి యచ్చటి గ్రంథ భాండారుల సాహాయ్యమున నందలి యేర్పాటుల నవగాహన చేసికొనుటకు వసతులు కల్పింపఁబడుచున్నవి. ఇంటికడ విద్యార్థులు తయారు చేసికొనవలసిన పాఠములు, లెక్కలపని చూచుకొనుటకు గ్రంథాలయము లుపయోగపడుచున్నవి. (పైని జెప్పిన కథా ప్రసంగములు, మ్యాజికు లాంతరు ప్రదర్శనములాది గాఁగల కార్య కలాపము, చిన్నవారల గ్రంథాలయముల కాకర్షించి వారి మనముల నందలి పుస్తకముల వైపుకు త్రిప్పుటలోఁ జాల సహాయపడుచున్నవి.) పాఠశాలలందలి వివిధ తరగతుల యుపయోగార్థము ప్రత్యేకము నిర్ణయింపబడిన గ్రంథసముదాయమును బోధనా సమయమున విద్యార్థులకు గనఁబడులాగున బ్రదర్శించుచు, మధ్య మధ్య గ్రంథ భాండారులు తమకు సమీపమునఁగల పాఠశాలల కేగి అందలి యుపాధ్యాయులు తమకు సాయపడునట్లు ప్రోత్సహించుచు, విద్యార్థులకు తమ తమ గ్రంథాలయముల యుపయోగ ప్రాశస్త్యములఁగూర్చి వినిపించుచు, వారి నందఱను తమ యభిమానులుగఁ జేసికొనుచుందురు.

ఇట్లు గ్రంథాలయములందలి పుస్తకముల బాల్యముననే చదువ నలవాటైన విద్యార్థులు బడి విడిచిన పిమ్మట సైత మెప్పటివలె గ్రంథాలయములను తా ముపయోగించు కొనుటయే గాక తమ పెద్దలకుగూడ వీనితో సన్నిహిత సంబంధమును సమకూర్తురు. ఇంత కార్యక్రమమును పాఠశాలా సహకారము మూలమునగదా గ్రంథాలయములు సాగించఁగలుగుచున్నది! వివేకవంతులగు పరసీమలందలి గ్రంథాలయ నిర్వాహకు లీ సహకార పద్ధతి నవలంబించి తమ యాశయములను జక్కగ సాధించుచుండుట యెరిగియు మన మేల యీ పాఠమును గ్రహింపరాదు ?

# గ్రంథాలయ సేవకుడు

శ్రీ పీతాంబరం వేంకటకృష్ణమాచార్యులుగారు
విశాఖపట్టణముజిల్లా గ్రంథాలయసంఘ కార్యదర్శి

ఏ యుద్యమము గాని సంస్థగాని క్రమ వికాసము నొందవలెనంటే నిర్వాహకులు అధికార రోగపూరిత పిశాచావేశ మనస్కులుగాక సేవాపరతంత్రులై స్వార్థరహితులై మానవ సేవయే మాధవ సేవ యను నిశ్చితాభిప్రాయము గలవారుగ నుండవలెను. అట్టివారిని ఏర్చి కూర్చుకొను బాధ్యత సంఘ సభ్యులపైనను ప్రజలపైనను గలదు. దేవేంద్ర సేవకుడ నని వామనమూర్తి, భక్తజన సేవకుడ నని నరసింహమూర్తి, శ్రీరామ సేవకుడ నని ఆంజనేయమూర్తి, పాండవ సేవకుడ నని శ్రీకృష్ణమూర్తి ఘనకార్యము లెన్నిటినో సాధించియున్నారు. నిర్వాహకుడు సేవకుడుగ తలంచుకున్నంతవరకు సంస్థ అభివృద్ధి చెందుననుటకు సందియము లేదు. నిజమగు సేవకుడే యజమాని; నిజమగు యజమానే సేవకుడు. అధికార వాంఛాపరులు సంఘమును ధ్వంసము చేయుదురనుటకు సందియము లేదు. ఇప్పటి గ్రంథాలయసేవకులందరు అధికార వాంఛను తృణీకరించి, సేవాపరత గలిగి, అందలి మహత్త్వమును గుర్తించి, ఐకమత్యము గలిగి గ్రంథాలయ సేవ చేసినచో గ్రంథాలయోద్యమము సర్వతోముఖముగ వ్యాపించి ప్రజలయందు నిరక్షరాస్యతవలన నేర్పడిన అంధకారమును పారద్రోలి విజ్ఞాన తేజమును వెదజల్లి దేశకల్యాణమును సమకూర్పగల ప్రజ్ఞావంతులను, ధీరులను తయారు చేయగలదని నా విశ్వాసము.

గ్రంథాలయ సేవకుడు సుశిక్షితుడగు అధికారిగ నుండవలెను. ఆతడు తన అధికారమును దుర్వినియోగము చేయరాదు. ప్రజాక్షేమమె తన యాదర్శముగ నుంచుకొనవలెను. స్వార్థమునకు తావీయరాదు. పొగడ్తలకు పొంగిపోరాదు. నిందలను సహించుకొనవలెను. ఎవరికిని బాధ కలిగించక తన పూనికను నెరవేర్చుకొన

వలెను. పట్టినపట్టు విడువరాదు. కష్టములను లక్ష్యము చేయరాదు. సద్గుణ గరిష్ఠులగు మహాసీయులు గ్రంథాలయ సేవకు నడుము కట్టి రంగమున ప్రవేశించి ప్రచారము సలిపినచో గ్రంథాలయోద్యమము సత్వరాభివృద్ధి గాంచి తద్వారా దేశమునకు ప్రజలకు శాంతి భద్రతలు చేకూరు ననుటకు సందియము లేదు. సర్వేశ్వరుని కృపాకటాక్ష వీక్షణము లీ సదుద్యమమునందును, దీని సేవకా బృందమునందును ప్రసరించుగాక !

---

## ప్రాచీన భారతీయ విజ్ఞానము *

(శ్రీనివాస సోదర కృతి)

*

గ్రంథ భండారముల నెందు గనినగాని
వెత్తి తలల పుస్తకములే వేనవేలు
ఘన పురా భారతీయ విజ్ఞానమొసగు
గ్రంథములటన్న వేయి కొక్కటియు లేదు.

ఇట్టి దుస్థితి గనుగొని బిట్టు వగచి
ఇపుడు గ్రంథాలయసభార్థ మేగుదెంచి
నట్టి పెద్దలతో మొఱవెట్టుకొనిన
గలుగు ఫలమని యిటు చెప్పగడగినాడ.

కనుడీ ! ఎంత యవస్థపట్టినదొ ! ఆ ఖండాంతరోద్దండులే
కని యబ్రంపడి భారతీయుల పురాజ్ఞానం బఖండంబటం
చు నుతుల్సల్పుచునున్న నావయిపుకున్ చూడ్కుల్ ప్రసారింపనో
పనివా రెందఱొ నేడునుండిరన నా వ్యామోహ మేలాటిదో !

---

* హిందూపురమున జరిగిన ౨౪ వ ఆంధ్రదేశ గ్రంథాలయ మహాసభ ప్రచార శాఖా సమావేశములో చదువబడిన పద్యములనుండి యెత్తివ్రాసినవి. ఈ పద్యములు పై పేరుతో చిన్ని పొత్తమురూపమున ప్రకటితములైనవి.

తనవా డెంతటిగొప్పవాడు గలడో తర్కింపనేబోడు చూ
డను చూడండు; విదేశపండితుడనన్ ఢంకాబజాయించి త
ద్ఘనతన్ మోచుకపోవు నెల్లెడలకున్; తత్తద్విదేశీయు లె
ల్ల నుతుల్ సేసినమీద సోదరుగనున్ ప్రాజ్ఞుం దిహత్యుండహో!

ఇట్టి వివేకవంతులకు నెట్టులు వచ్చు స్వరాజ్య మింక? నె
ప్పట్టున జాతిగౌరవము వర్ధిలజేయు ప్రబుద్ధభావముల్
గట్టిగ నాదరించుట యకార్యముగా దలపోయు టింకనేన్
చెట్టతనంబటంచు నిరసింపుడు నింపుడు జాతి గర్వమున్.

ఆలకింపుడు తొల్లి మహర్షులెట్టి
జ్ఞానసుధనంది ఖండఖండముల్ల బంచి
ఈ ప్రపంచ నాగరకతా వృక్షమునకు
ప్రబల కాండముగా నిల్పబడిరొ సుంత.

సృష్టి మొదటినుండి ఎల్లజాతులలోన
గుణగణమున ప్రథమగణిత మెద్ది
అనిన భరతజాతియని బొమ్మ జఅచుచు
గర్వపడుచు నిల్వగలము మనము.

అతిపురాతనములను రామాయణాది
గ్రంథముల నాటి జీవితక్రమము గనుడు:
ప్రాణములకన్న సత్య మత్యధిక మిచట.
సత్యమున కియ్యదియెనుండు జన్మభూమి.

ముక్కుకుసూటిగా, తనువుపోయిన ద్రోహపుచింతలేక, బల్
చక్కనితోవ బోయెదరు సర్వజనమ్ములు, రాజ్యపాలనన్
ఎక్కటి సత్యశోధవమె యెంతయునొప్పునటంచు హ్యూనుసాం
గక్కజమంది వ్రాసిచనె నయ్యది నిద్దపు దాఖలాగదా!

ఇప్పటికి రెండువందల యేండ్లకిరింద
నోటులు రశీదులునులేక నోటిమాట
నెంతయో వడ్డివ్యాపార మిచట సాగె!
కోటిపత్రాల విలువ వాక్కుమాట మనకు.

అడ్డులేకుండ మొన్న దా కన్యఖండ
ముల విశేషముగా సాగిపోయినట్టి
బానిసల వర్తకము లేదు భరతభూమి
గణ్య మియ్యది యనియె మెగస్తనీసు.

అంతులేని నమ్మకమును, న్యాయదీక్ష
అతిథిపూజ, శిష్టాచార, మతికృతజ్ఞ
వర్తనము, శాస్త్రపాండితి భారతీయ
సహజములటంచు నబులుఫజల్ లిఖించె.

భారతీయుల నిస్స్వార్థ భావమునకు
అనుజులును పత్ని నరకమునందు నుండ
దాను స్వర్గము నొల్లని ధర్మరాజు
కతయె వేనోళ్ళ సాక్ష్య మీగలదుసుండు.

విశ్వవిద్యాలయములు స్థాపించినారు
దివ్య యౌగికసిద్ధి సాధించినారు
జీవితోన్నతతత్వ మార్జించినారు
భారతీయుల మించినవారు గలరె ?

మన పురా భారతీయుల మహితబుద్ధి
దీపకళికగా సకలాన్య దేశములును
చీకటియుగాలు వెలువడి చేరెసుండు
నేటివైజ్ఞానిక యుగమ్ము నిశ్చయముగ.

మహితసాహిత్యమా? తత్త్వమా? గణితమ ?
ఏదియేది పాశ్చాత్య ప్రసాదిత మని
అనుకొనుచు నుందురో అదియదియె కనుడు
దానిబీజము భరతపుత్రికుడె వేసె.

లలితములైన పీఠికథలం గొని బాలుర దిద్దితీర్చుటల్
చలితవయౌ దశాంశములలో గణితమ్మును తేల్చివేయుటల్

తెలివిమధించి నిగ్గు గడిదేర్చెడి నాచతురంగ మాడుటల్
విలియము జోన్సు మూడు గనిపెట్టెను భారతజాతియంచనెన్.

* * *
* * *

భారతీయుల విజ్ఞాన భవనమునకు
ప్రోదిది నాధ్యాత్మికంబు పునాది యగుట
సర్వమానవ నిశ్శ్రేయసంబు గలిగె
వారి కృషిలోన గుర్తింపవలయు దీని.

ఆధిభౌతికంబె అంతర్బహిర్వ్యాప్తి
గలది యగుట నన్యఖండ బుద్ధి
ప్రచురమయ్యె గనుడు వైజ్ఞానికోద్దండ
విలయకాల నృత్య విలసనంబు!

అఖిల గ్రంథాలయోద్యమ వ్యాప్తిపరుల
వేడికొనియెద భారత విమలశక్తి
ప్రజల మనసుల బట్టించు గ్రంథములను
అమితముగ జేర్పుడంచు గ్రంథాలయముల.

కలవెన్నేనియు నాంగ్లభాష ననువౌ గ్రంథంబు లీ భారతీ
యుల తేజోతిశయంబుజూపుసవి; తద్వ్యుత్పత్తి సంపాదనో
జ్జ్వలకౌతూహలముంబొనర్పుడుప్రజన్; సద్గ్రంథముల్ పెక్కిటిన్
తెలిగింపించి ప్రజాళికిం దభినవోత్తేజంబు రేకెత్తగన్.

*

# సాంకేతిక శాఖాసమావేశము

## అధ్యక్షోపన్యాసము


### శ్రీ పి. కొండారెడ్డిగారు, డి. యల్. యస్.

ఆంధ్ర యూనివర్సిటీ లైబ్రరీ-గుంటూరు


గ్రంథాలయసేవక మహాశయులారా !

శ్రీ ఆంధ్రదేశ గ్రంథాలయ మహాసభ సాంకేతిక శాఖకు అన్నివిధముల చిన్నవాడ నగు నన్ను పెద్దగా ఎన్నికచేసి గౌరవించిన ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘమువారికి అందు ముఖ్యముగా మిత్రులు శ్రీ పాతూరి నాగభూషణముగారికి నా కృతజ్ఞతాభి వందనములు. ఆంధ్రవిశ్వకళాపరిషత్ గ్రంథాలయాధ్యక్షత్వముచేయుచు గ్రంథాల యోద్యమమును గూర్చి నేను అప్పుడప్పుడు సభలలోను పత్రికలలోను వెలువరించిన ఉపన్యాసభావములను సోదరులగు మీ రెల్లరు సాదరముగ చిత్తగించినట్లు ఈ యెన్ని కకు నేను అర్థము చెప్పుకొనుచున్నాను. ఈ గ్రంథాలయమహాసభ నా జన్మస్థాన మగు రాయలసీమలోనే జరుగుటయు, అందు సాంకేతికశాఖకు నేను అధ్యక్షతను వహించుటయు ఎంతయో నాభాగ్యమని తలచుచున్నాను.

మనదేశమున ప్రారంభింపబడిన అన్ని యుద్యమములవలెనే గ్రంథాలయోద్యమముకూడ మందడుగుగా సాగుచున్నమాట నిజము. కాని యింతవరకును ఈ యుద్యమమును సాగించుచున్న పెద్దల ఉత్సాహము సభలు, ఉపన్యాసములు మున్నగు సంబరములతోడనే సంతృప్తి జెందుచున్నది గాని, గ్రంథాలయస్థాపన, నిర్వహణములకు సంబంధించిన సాంకేతిక విషయముల తెలిసికొనుటయందుగాని, తెలిసికొన్నవాని నితరులకు తెలుపుటయందుగాని, అట్టివానిని కార్యరూపమున ప్రదర్శించుటయందుగాని ప్రవేశింపదయ్యెను. సుమారు ముప్పదిసంవత్సరములు వయస్సుగల ఆంధ్రదేశ గ్రంథాలయసంఘము గ్రంథాలయశాస్త్రమునుగూర్చి ఒక గ్రంథమునైనను ప్రకటింపజాలకపోయెను. ఒక ఆదర్శ గ్రంథాలయము నైనను నెలకొల్పలేక పోయెను. సమగ్రమైన గ్రంథాలయశిక్షణ కొసంగు పాఠశాల నైనను స్థాపింపలేదు. ఇంతకంటె శోచనీయమగు దురవస్థ యింకేమియుండగలదో యోచింపుడు ! ఈ మధ్య నీ గ్రంథాలయ మహాసభయందు సాంకేతికశాఖ నొకదాని నేర్పాటుచేసి పని చేయబూనుట మాత్రము నిశ్చయముగా గొనియాడదగిన విషయము. ఈ సాంకేతిక శాఖాసమావేశమువలన గ్రంథాలయసభకు వచ్చిన ప్రతినిధులందరు గ్రంథాలయ శాస్త్రసంబంధమగు చర్చలయందు పాల్గొని వానిఫలితములను తమ గ్రంథాలయము లందు ఆచరణలో పెట్టుటకు అవకాశమేర్పడగలదు.

పాశ్చాత్యదేశములందు గ్రంథాలయములనుగూర్చి అనుభవపూర్వకములును, సవిమర్శములును నగు నూతన విశేషములెన్నెన్నియో గ్రంథరూపమున వారి వారి భాషలలో నేడు వెలువడుచున్నవి. అచట గ్రంథాలయములు క్రొత్త క్రొత్త పద్ధతుల ననుసరించి నెలకొల్పబడుచున్నవి. గ్రంథాలయశాస్త్రమం దారితేరిన పండితులే అందధికారులుగానుండి నడుపుచున్నారు. ఆ శాస్త్రమునందుకూలంకషముగు పాండిత్యము లేనిచో ఎంతవారికైనను అచట గ్రంథాలయాధికారులుగా నియమింపరు. ఇంక మనదేశమందన్ననో ఉన్న గ్రంథాలయములే స్వల్పము. అందు చక్కగా నడుపబడుచున్నవి అతిస్వల్పము. వానిలోకూడ సాంకేతిక పరిజ్ఞానముగలవారిచే నడుపబడుచున్నవి స్వల్పాతి స్వల్పము.

ఆధునిక గ్రంథాలయములను పరిశీలించిచూచిన మన గ్రంథాలయములందు ఆచరణలో నుంచవలసిన నూతనవిషయము లెన్నియోగలవు. అందు ముఖ్యమైనవానిని మాత్రమిందు సూచించుచున్నాను.

గ్రంథాలయమునకు ఎట్టి పుస్తకములు అవసరమో (Book-selection), అవసరమైనవానిని తెప్పించుటెట్లో (Book ordering), ఆ పుస్తకములను వర్గీకరించుటెట్లో (Classification), వాటి పట్టీలను తయారుచేయుటెట్లో (Cataloguing), వానిని అరలలో భద్రపరచుటెట్లో (Shelf - arrangement) వానిని చదువరులకు వీలైనంత ఉపయోగకారులుగా నొసఁగుటెట్లో (Reference service), వీనికి సంబంధించిన రికార్డులను (Accession and shelf registers) తయారుచేసికొని సరిచూచుకొనుటెట్లో గ్రంథపాలకుడు తెలిసికొని యుండవలెను. గ్రంథాలయమును సంవత్సరమున కొకసారి పరిశీలించి, ఉన్న పుస్తకములను సరి (Stock-taking) చూచుకొనుచుండవలెను.

గ్రంథాలయములయందు చదువరులు స్వయముగా పుస్తకములన్నియు చూచి తమకు కావలసినవానిని తామే స్వేచ్ఛగా ఎంచుకొనుటకు వీలగు 'స్వేచ్ఛోపలబ్ధి' (Open access) పద్ధతి నవలంబింపదగును. చదువరులకు పుస్తకములనిచ్చి పుచ్చుకొను సులభపద్ధతి (Charging system) నొకదానిని అమలులో పెట్టుకొనవలెను. ఒక గ్రంథాలయములో లేని పుస్తకములను, మరొక గ్రంథాలయమునుండి తెప్పించి చదువరులకు సాయముచేయవలెను (Inter library loan). గ్రంథాలయమునకు తెప్పించిన పత్రికలలో ముఖ్యమైనవానిని సంపుటములుగా తయారుచేసి భద్రపరచవలెను (Preservation of back numbers of periodicals and their binding into volumes). కాలమెంతయో అమూల్యముగా నెంచు విషయ శోధకులకు కావలసిన గ్రంథపరిచయ సేవ (Reference and bibliographical service) నొసగవలెను. ఈ పైచెప్పిన విషయములకు సంబంధించిన సాంకేతిక జ్ఞానమెంతయో గ్రంథభాండాగారికి కావలసియున్నది.

గ్రంథాలయ భవననిర్మాణమునందుకూడ చూపవలసిన సాంకేతిక పరిజ్ఞాన మెంతయోకలదు. ఎచట నిర్మించిన ఎక్కువమందిని ఆకర్షించునో, ముందు ఎంత వరకు గ్రంథాలయ మభివృద్ధిచెందుట కవకాశమున్నదో, గ్రంథసేవా సంబంధమగు వేర్వేరు విషయముల కెట్లు తావొసంగవలసియున్నదో మొదలగు అనేకవిషయములను భవన నిర్మాణమునకు పూర్వమే పర్యాలోచన చేయవలసియున్నది. అగ్నిభయమున కవకాశములేనట్టియు, వెలుతురు గాలి నిరాటంకముగా వచ్చుటకు వీలగునట్టియు స్థల నిర్ణయముచేయుట, గ్రంథాలయము ఒక భవనమునందు భాగముగానుండక ప్రత్యేక భవనమును కలిగియుండుట, అందు గ్రంథములనుంచుటకు (Stack room), పాఠకులు చదువుకొనుటకు (Reading room) కావలసిన ఏర్పాట్లు చేయుట మున్నగు విషయముల నీ సందర్భమున గమనింపవలసియున్నది.

గ్రంథాలయములు సాంకేతికముగా నిరుపముళ్లైయుండవలెనన్నచో, ఉపాధ్యాయుడు, న్యాయవాది, వైద్యుడు, ఇంజనీయరు వారి వారి వృత్తులకు సంబంధించిన విషయములలో ప్రత్యేక శిక్షణను ఎట్లు పొందుదురో, అట్లే గ్రంథభాండాగారియు తనవృత్తికి సంబంధించిన సాంకేతిక శిక్షణను పొందవలయును. కావున గ్రంథాలయ సంఘములును, విశ్వవిద్యాపరిషత్తులును, గ్రంథాలయ నిర్వహణకు తగిన శిక్షణను, పాఠ్యక్రమమును, పరీక్షలను ఏర్పఱచి గ్రంథాలయశాస్త్ర విశారదులను తయారుచేయ వలసియున్నది. అట్టి విశారదులే గ్రంథాలయములందెల్ల నిర్వాహకులుగా నుండి వానిని చక్కగా నడుపుచు ప్రజలకుపయోగపడునట్లు చేయవలసియున్నది. ప్రస్తుతము గ్రంథాలయములందు సాంకేతికజ్ఞానమే లేని వారిని గ్రంథపాలకులుగా నియమించి ఆ ఉద్యోగము నొక గౌరవపదవిగానో, గుమాస్తాపనిగానో భావించుచున్నారు. జీతము బత్తెములేని గౌరవోద్యోగికిని (Hony. Librarian) స్వల్ప జీతముతో ప్రోత్సాహములేకుండ కాలక్షేపము చేయు గుమాస్తాకును, గ్రంథాలయాభివృద్ధియందు అభిమానమెట్లు కలుగును? కావున దారినిపోవువారి నెవరినో గ్రంథాలయాధికారులుగా నియమించి గ్రంథాలయములను ధ్వంసముచేయక, ఉచిత శిక్షణనుపొందినవారిని గ్రంథపాలకులుగా నియోగించి, ఆధునిక పద్ధతుల ననుసరించి గ్రంథాలయముల నడుపుటకు ప్రయత్నించవలెను. ఈ సభయందలి చర్చలవలన తేలిన ఫలితములను గ్రంథాలయములవారిచే నాచరణలో పెట్టించుటకును, ఈ సందర్భమున వారికి కావలసిన సహాయముచేయుటకును ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘము వారు సాంకేతిక ఉపసంఘముల నేర్పాటు చేయవలెను.

గ్రంథాలయమును, గ్రంథాలయ నిర్వహణమును, గ్రంథాలయాధికారిని సాంకేతికముగ తగిన గౌరవస్థితికి గొనివచ్చినప్పుడే, మన గ్రంథాలయమహాసభచేయు కృషి సార్థకముకాగలదు. ఈ సభాముఖమున అందుకు తగిన కార్యకలాపమునకు దారి తీయు చర్చలు, నిర్ణయములు చేయుదురుగాక యని ప్రార్థించుచు, నా యుపన్యాసము నింతటితో విరమించుచున్నాను.

# TWENTY-FOURTH
# Andhradesa Library Conference
## OPENING ADDRESS

BY

Rao Sahib S. R. RANGANATHAN, M.A., L.T., F.L.A.
*Librarian, Madras University Library and Secretary, Madras Library Association.*

**Mr. Raja Rao! Mr. Laxminarayana Rao! Members of the Andhradesa Library Association! Ladies and gentlemen!**

I am very pleased to have this opportunity to discharge a duty that I had long owed to the Andhradesa Library Association, to Mr. Nagabhushanam, the secretary of the Association and to Mr. A. Sreenivasa Rao of Saraswata Niketanam, Vetapalem, Guntur Dt., who had invited me on several occasions to take part in their activities. But due to my primary duty to the library which gives me my daily bread, I could not accede to their request; but now the war has actually brought my library to mere existence and hence I thought that this was an opportunity for me. Moreover, Mr. Nagabhushanam is a shrewd business man, knowing as he does, my softness to my old students he added to one of his business letters to me a post-script as if casually stating that the twenty-fourth Andhradesa Library Conference would be held at Hindupur and that my old student Mr. Krishnayya was working hard in that connection. Mr. Krishnayya is one of those rare self-effacing souls, who throw their whole heart into whatever work they undertake. Though he is not of the library profession technically, he is doing for the library movement more than what many a professional librarian does. It had always been my wish to visit Krishnayya in his scene of work. These two factors were quite enough to accept the invitation of your reception committee.

Library movement of the modern type is of very recent origin in our land. It is true that we have libraries from very ancient times, but their detailed history has yet to be written. Even if it is written it will be different from the modern library movement in many respects. Modern library movement has many phases. Many phases of it are incident in several parts of our land. I shall refer to a few of them,

The phase in which the library movement is fostered by the state itself is incident in all its fulness in the enlightened state of Baroda. There, according to the latest report 50% of the villages have libraries, 83% of the population have easy access to it. This phase appeared in Baroda early in the present century. Shortly thereafter the Punjab witnessed another phase of library movement which would make the library the heart of an educational institution. The Punjab University has the honour of having been the pioneer Indian University in this matter. The Andhra country experienced quite a different phase of the library movement. Here there was no state to make it a Government affair, nor was there a University to look after the second phase I have mentioned. Here, the library movement owed its strength to the people themselves—to the inner urge of the people, of the masses, to have books and to have libraries.

These various phases had their own advantages as well as disadvantages. In Baroda, for example, there was a tendency for people to look upon library movement as something which was of importance to the state only. The indifference started by such an attitude had to make the state stipulate that Government help would be forthcoming only if the people themselves contributed their own quota of money and effort. In the Punjab the fact that a highly organised research library had to be brought into existence required a highly evolved library technique. In its anxiety to do as well as possible the Punjab adopted whole-sale the technique developed in America. However good this was to suit American conditions, it was not adequate to meet Indian conditions and yet they were too impatient to build their own techniques and were prepared to be satisfied with what could be imported. In the Andhra country the need for technique was not felt at all. There the libraries were all small ones—a thousand village libraries and few libraries of any considerable size. Now it is well known that you don't want a technique to deal with work of small dimensions. You don't want for example the knowledge of the technique of *engineers* to build a small hut. But if you want to build a hall like this technical engineer's knowledge becomes necessary. If you want to build something bigger, say the huge buildings in Delhi, you want even a more powerful technique. No wonder therefore that the library movement in Andhra did not interest itself in any considerable technique.

It is here that the Madras Library Association, with which I happened to be connected comes in. The phase of the library move-

